





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

# వీరమాతలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016336

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

**Approved by the Text Book Committe in Fort St. George Gazette dated 24-4-34 in page 227.**

శ్రీ

శ్రీకృష్ణాయనమః



# వీరమాతలు

శ్రీభోజలీల రచించిన,

కట్టమంచి లక్ష్మమగారు,

**1933.**

*Registered*] [0—10—0.



శ్రీకృష్ణాయనమః.

# వీరమాతలు

## రామునితల్లి

### శ్రీరాముఁడు.

అయోధ్యాధీశుఁడగు దశరథ భూపాలునికిఁ గౌసల్య కైకేయి సుమిత్రలను ముగ్గురు భార్యలుగలరు. వారికి నారాయణాంశమున కౌసల్యకు శ్రీరాముఁడును, కైకేయికి భరతుఁడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును గలిగిరి.

ఆపుత్రరత్నములఁ జూచి దశరథుఁ డానందవారిధి యందు నోలలాడెను. బీదసాదల కన్నదానము వస్త్రదానము మున్నగు ననేకదానములు గావించి వారికి క్రమముగ నామకరణ అన్నప్రాశన చౌలోపనయనాది సంస్కారములు గావించెను. అయిదవయేఁట కులగురుఁడగు వసిష్ఠునొద్ద విద్యాభ్యాసము చేయించెను. ఇట్లు నలువురు కుమారులు దినదిన ప్రవర్ధమానులగుచు క్రమముగ విద్యల నభ్యసించుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు దశరథు నాస్థానమునకు విశ్వామిత్రుఁడేతెంచి పూజలంది యుచితాసన మధిష్ఠించిన తరువాత

దశరథుఁడు "మహాత్మా! పుత్రోత్సవము నాఁటికంటె నేఁడు నేను ధన్యాత్ముఁడనైతిని. మీరూరకరారు. వచ్చిన సంగతి నెఱింగించి నాజన్మము సార్థకముగాఁ జేయుఁ"డని వేఁడ విశ్వామిత్రుఁడమిత సంతోషముతో "రాజచంద్రమా! నేనొక మహాధ్వర మొనర్ప దీక్షగైకొని మధ్వనమున హోమాగ్ని వ్రేల్చుచుండ నిద్దఱు రక్కసులు కామరూపులై రక్తమాంస శల్యాదుల వేదియందు నింపి విఘ్నమాపాదించు చున్నవారు. చిరకాలమునుండి యార్జించిన తపః ఫలము వ్యర్థమగునను చింతచే నూరకున్నాను. నాయజ్ఞము నిర్విఘ్న మొనరింప శ్రీరామమూర్తిని బంపుము" అనెను.

అంతనృపాలుఁడు శరీరము కంపింపఁగన్నులనీరు ప్రవహింప ప్రజ్ఞదప్పనంతటి స్థితితో అయ్యో! మునికులతిలకా! యిదియేటిన్యాయము? పంద్రెండేండ్లైనను సరిగనిండని చిన్ని కుమారు నిట్టికార్యమునకు నియమించుటయా? తాముత్తరు విచ్చిన నేనేవచ్చి మీకార్యము కొనసాగింతునన విశ్వామిత్రుండత్యాగ్రహమున దశరథు ననేకవిధములఁ నిష్ఠురోక్తుల దూఱి యచట నిలువక బయలుదేఱెను. విశ్వామిత్రుని యాగ్రహమునుగని వసిష్ఠుఁడు కార్యము మించినదని గాధినందనుని మహిమంబుల వర్ణించి విశ్వామిత్రుని కోపంబుడిపి ప్రసన్నుని జేసికొమ్మని దశరథునితోఁ జెప్ప నతఁడట్లుగావించి యడిగినప్పుడే పంపని యపకారమునకై లక్ష్మణుని సహితము తోడుచేసి

పంపెను. శ్రీరామలక్ష్మణులు తలిదండ్రులకు గురువునకు సమస్కరించి యాశీర్వచనములఁబడసి విశ్వామిత్రుని వెంట నడతెంచిరి.

సాయంకాలమునకు సరయూతీరముఁజేరి విశ్వామిత్రుఁ డచట బాలురకు బలాతిబలవిద్యల నుపదేశించి దారినడుచు చుండెను. పోవంబోవ సూర్యకిరణములు చొరనిదట్టంపు టడవిని గని రాముఁడు విశ్వామిత్రునితో మహాత్మా! ఇది యేమిచోద్యమని యడుగ, నది తాటకవనమనియు నందా రక్కసి మారీచ సుబాహులను నిరువురు కుమారులతో ప్రాణిహింస చేయుచున్నదనియు, వారిని సమయించి లోక హితముచేయుఁడనియు నతఁడు బోధించెను.

అంతరాముఁడు వికృతాకారమునఁ బఱతెంచు తాటక నొకకోలఁ గూలవేసెను. దేవతలు పుష్పవర్షము గురిపించిరి. మునులు స్తుతించిరి. విశ్వామిత్రుఁడు మిగులప్రీతితో రాముని గౌఁగిలించుకొని యనేక దివ్యాస్త్రము లొసంగి ప్రయోగోప సంహారరహస్యంబులఁదెలుప రామలక్ష్మణులు వానినిమిగుల ప్రీతితోగ్రహించి నడవ కొంతనడి కొక రమణీయమైన వన మును గని మిగుల సంతసించి యందు వైరంబులులేక మృగ పక్షులుండుటఁజూచి యది యెవ్వరివనమని రామలక్ష్మణులు విశ్వామిత్రునడిగిరి. అదియే తనదనియు నందేయజ్ఞము జరుగు ననియు దానికి విఘ్నము సేయుటకే రాక్షసులు వత్తురనియు నతఁడుదెలిపెను.

మఱునాఁడు వేకువను మేల్కొని రామలక్ష్మణులు విశ్వామిత్రునికి నమస్కరించి నాఁడే యాగమారంభము గావింపుఁడన నట్లే విశ్వామిత్రుఁడు దీక్షవహించి కూర్చుండె ను. అప్పుడాయగ్నిని కంటికిరెప్పవోలె నతిజాగరూకతతో రామ లక్ష్మణులు గాచియుండిరి. అయిదుదినములు నిర్విఘ్నముగఁ గొనసాగెను. ఆఱవనాఁడు రాఘవులొండొరుల హెచ్చరించుకొని కాచుచుండ గొప్పమేఘగంభీర ధ్వని వినఁబడి తరువాతి తలలెత్తి చూచుటకు సహితము వీలుగాక శిలావృష్టిగురిసి పదపడి క్రతుశాలపై వేదిపై శోణితంబు వర్షించె. దానిని జూచిన రాముఁడమితక్రోధముతో లక్ష్మణుని హెచ్చరించుచు వాయవ్యాస్త్రమున నయ్యసహ్యవృష్టి మాయించి మానవాస్త్రము ప్రయోగించె. అదిమారీచునిగొనిపోయి యుదధి జలంబులఁద్రోసె. రాముఁడు వెంటనే వహ్నిమార్గణమున సుబాహు బాహుదండంబులు శిరంబులు ఖండించె. లక్ష్మణుండు తక్కిన బలంబుల రూపుమాపె. అట్లు యాగంబు నిర్విఘ్నముగఁ బరిసమాప్తినొంద విశ్వామిత్రుఁడు నిర్భరానందమున నాకుమారుల గాఢాలింగనమొనర్చి యాశీర్వదించె.

అంత విశ్వామిత్రుఁడు మునులందఱితోఁగలిసి కుమారులఁదోడ్కొని మిథిలకుఁ బ్రయాణమైత్రోవను గల వింతల వీనులలరఁ జెప్పుచు చనుచుండ గౌతమ శాపమునఁ బడిన యహల్య రాముని పాదధూళిచే పవిత్రయై శాపవిముక్తినొంది నమస్కరించి వెడలె. పిమ్మట రామలక్ష్మణ విశ్వామిత్రులు

జనకుని యజ్ఞవాటికిం జేరిరి.

జనక మహారాజు వారికర్ఘ్యపాద్యమ్ములచే నతిథిసత్కృతులు గావించి యుచితాసనముల నాసీనులం జేసి "మహాత్మా! తమరాకవలన నాజన్మము సఫలమయ్యె. నాయజ్ఞము పవిత్రమయ్యెనని యనేక విధములఁ గొనియాడి ముని ప్రక్కనున్న రాకుమారులఁజూచి వీరెవరి కుమారులు?" అని యడుగ దశరథ కుమారులనియు రామలక్ష్మణులనియు తాటకను ద్రుంచి సుబాహునిసంహరించి నాయజ్ఞము నిర్విఘ్నముగ జరిపి యహల్యాశాపవిముక్తఁ జేసి నీగృహమునయున్న శివుని చాపముఁ జూడ వచ్చిరనియుఁ విశ్వామిత్రుఁడు చెప్పెను.

ఆమఱునాఁడందఱు నిత్యకృత్యముల నిర్వర్తించుకొని దివ్యపీఠముల లంకరించియుండ విశ్వామిత్రుఁడు విదేహునితో శివునిచాపము తెప్పింపుమని చెప్పెను. ఆవిల్లువిఱిచిన వారికి నావరపుత్రికనిత్తునని యతఁడు చెప్పి సభకుఁ దెప్పించెను. రాముఁడు జనక విశ్వామిత్రుల సమ్మతిని రా కుమారులెల్ల మహాసాహసంబని వీక్షింప నెక్కుపెట్టుటలోపల పెళపెళారవ మున దిక్కులపిక్కటిల్ల నదివిఱిగి తునుకలై పుడమిపైఁబడెను.

ఆశబ్దమునకు జనక లక్ష్మణ విశ్వామిత్రులు దప్పఁ దక్కినవారు మూర్ఛిల్లిరి. జనకుఁడనేక విధముల విశ్వామిత్రుని గొనియాడి దశరథుని రప్పించి సీతను శ్రీరామునకిచ్చి వివాహంబుగావించె. అటువలెనే రెండవకూఁతు నూర్మిళను

లక్ష్మణునకు నిచ్చెను. అట్లే జనకుని తమ్ముఁడు కుశధ్వజుఁడు మాండవీ శ్రుతకీర్తుల భరత శత్రుఘ్నుల కిచ్చెను. మహర్షు లాశీర్వదించిరి. సభాసదులు హర్షించిరి. వందిమాగధులు జయశబ్దంబులు చేసిరి. మింట వేలుపులు పూలవాన గురిసిరి. గంధర్వులు పాడిరి. రంభాదు లాడిరి. ఇట్లామహోత్సవము పరమాద్భుతముగ జరిగెను.

అంత విశ్వామిత్రుఁడు వెడలిన తరువాత కొడుకుల కోడండ్రతో దశరథుఁ డయోధ్యకు బ్రయాణమయ్యెను. అంత నుఁగొంత దూరమరుగ దుశ్శకునంబులు తోఁచెను. అందుకు మదిం బంక్తిరథుండు గలంగ నంతలో పరశురాముఁ డేదుగై "యేడీరాముఁడు" అని శ్రీరాముని యెదుటికి వచ్చి నిలిచెను.

రామా! నీవు మహాబలశాలివఁట! మద్గురు శరాసనంబును విఱిచిన పోటుబంటవఁట! కాన నిన్నొక చేయిచూడ వచ్చితి; చివుకు విల్లేమిలెక్క? ఇదిగో! నాచేతనున్న వైష్ణవ ధనువు నెక్కు వెట్టుము చూతము! అని యాయ నతని బాణ బాణాసనంబులతోఁ దేజముస్సైతమాకర్షించి రాముండు పరశురాముంజూచుచు ననాయాసంబున నెక్కిడి "జామదగ్న్య! విప్రుండవని గురుబంధువని నీజీవంబులఁ గొననైతి. కాని మత్కరశరసంధానం బమోఘంబు గాన భయదీయ పాదగమన శక్తిని ఖండించెద. కాదంటివేని తపోబల సముపార్జిత పుణ్యలోక ప్రాపణశక్తిని హరించెద. రెంట నీకభిమతం

బెయ్యేది?" యన నతండు తెల్లఁబోయి పాదంబులఁ గొట్టకు నాపాలి పుణ్యలోకంబుల నేయుము, అన రాముడట్లు గావించె. అంతఁ బరశురాముఁడు రాముని దీవించి ప్రదక్షిణించి యాత్మ నమస్కారము గావించి వీలుకోలు వడసి మహేంద్రగిరికేగె. శ్రీరామమూర్తియు వసిష్ఠ దశరథుల సన్నిధికరుదెంచి సకలం బెఱింగించి సుఖముగ నయోధ్యఁ బ్రవేశించె.

ఇట్లు గొంతకాలము చన దశరథుఁడు భరతునిఁ జేరఁ గిసికుమారా! శత్రుఘ్న సమేతుఁడవై కేకయదేశమునకేగి నీమాతామహుని ప్రియంబుఁ దీర్చిరమ్మని పంపెను.

మఱికొన్నాళ్ళు చన్నపిదప నొకనాఁడు పంక్తిరథుండు రామునకు పట్టాభిషేకి మొనర్పఁ గోర్కెగలిగి సామంతుల మంత్రులఁ బురోహితుల ననుమతి యడుగ వారు మహాసంతోషమున సమ్మతించిరి. సర్వసన్నాహములు జరుపఁబడెను.

మంథరయను దాసి దీనినంతయుఁజూచి కైకకనేక విధముల బోధించి శ్రీరాముని పదునాలుగేండ్లు వనవాసము చేయనంపుటయు భరతునకు పట్టము గట్టుటయు నను రెండు వరములు కోరుమనెను. మంథరమాయ మాటలకు వశమైన కైక దశరథుని రెండు వరములడిగెను. లేదనలేక దశరథుఁడు కైకకు కోరిన రెండు వరములిచ్చి రాముని వనవాసమునకు సీతా లక్ష్మణులతోఁ బంపి తాను తనువుఁ బాసెను.

రాఘవుఁడు స్వర్ణదియొడ్డున గుహునిగాంచి నదిని దాఁటింపుమనెను. గుహుఁడు శ్రీరామపాదరేణువు సోకినమాత్రాన రాయి నాతియయ్యె నిప్పుడోడ యేమగునోయని రాముపాదములుకడిగి యోడనెక్కించెను. అట్లు వారునదిదాఁటి భరద్వాజముని యాశ్రమమున నారాత్రిగడపి మఱునాఁడు పయనించి చిత్రకూటముఁజేరిరి. అచటికిభరతుఁడేతెంచి రాము చరణంబులకు మ్రొక్కి దశరథుఁడు పరలోకంబున కేగుటయు నెఱింగించి రమ్మని ప్రార్థింప, జనకు నాజ్ఞమీఱుటకుఁ గాదనియు తనయాజ్ఞ పాలింప పట్టణంబేలుమనియు రాముఁడాజ్ఞ సేయ సమ్మతింపక భరతుఁడు రాముపాదుకలఁగొనిచనెను.

శ్రీరాముఁడంత సౌమిత్రి భూపుత్రులంగూడి చిత్రకూటమువదలి పోవునపుడు విరాధుఁడను రాక్షసుఁడు సీతనెత్తుకొనిపోవ వానిఁద్రుంచి సీత నోదార్చి అత్రిమహాముని యాశ్రమంబునకుఁజని యచటనుండు మునులకు రాక్షస బాధ తప్పించి మఱిపోవుచుండెను.

వారిట్లడవిలోనడచి చనునప్పుడు రతిజసమానులు వీరికి పాదచారితన మేటికివచ్చెనో యని చెంచితలు బ్రహ్మను దూషించుచుండిరి. అట్లువారు నడచి పంచవటిఁజేరి యచట పర్ణశాలనిర్మించుకొని కొన్నినాళ్లు సంతోషముననుండ చుప్పనాతి యనుదైత్యాంగన వచ్చి రాముని గామింప లక్ష్మణుఁడు దాని ముక్కు చెవులుగోసి పంపెను. అదియట్లు ముక్కుచెవులు

డేగి నేఁడ్చుచు తనసోదరులైన ఖరదూషణాదులకుఁ జెప్పెను. వారు పదునాల్గువేలరాక్షసులతో రామునిపైకిరాఁగ నతఁడు వారినెదిరించి సమయించి జయముగాంచి మరలి పర్ణశాలకు వచ్చెను.

అప్పటికిని శూర్పణఖ చలముపట్టి సాధింపఁగోరి లంక కేగి రావణునితో రాముభార్య చాలచక్కనిదని వర్ణించి నీకు సిద్ధించిన నే సంతసింతునన, కామాంధుఁడైన రావణుఁడు కన్నులుగానక మారీచుని కనకమృగముగాఁ బంపి తాను తాపసి వేషముధరించి రాముఁడున్న వని కేగెను.

కనక మృగమునుగని యత్యపేక్షతోఁ బట్టియిమ్మని బ్రతిమలాడు సీతకోరికఁదీర్చ లక్ష్మణుని కావలిపెట్టి రాముఁడా మృగము వెంటనరుగ నది చాలదూరముగొనిపోవ, నది మాయ మృగమనియెఱిగి దానిఁగూలనేయ నది "హా! లక్ష్మణా!" యనికూలె. ఆరవంబువినినసీత లక్ష్మణుని నిష్ఠురోక్తులాడి యన్నను జూడఁబంప, నసమయంబెఱిఁగి సన్యాసివేషధరుఁడగు రావణుఁడేతెంచి సీతనెత్తుకొనిపోయెను. అప్పుడుసీత మహాదుఃఖముతో "నాపేరుసీత నేను శ్రీరాముని భార్యను నన్ను గాపుఁడనియేడ్చెను. ఆయార్తనాదము వినిన జటాయువెదిరించి రావణునితో యుద్ధమొనర్చి రెక్కలు తెగి నేలగూలెను.

మరల రావణుఁడు సీతనుగొనిపోవుచుండ నామె తన యాభరణములఁ జీరకొంగునఁగట్టియొక కొండయందు వానరు

గొనిపోవుటయు లంక త్రోవయు సంపాతియను పక్షి వారికె ఱింగించెను. అంత వారు మహాసంతోషముతో నాగిరి శిఖరం బారోహించి సముద్రమునుగనుగొని తమతమ సత్వస్థితులును గమనించి గపిసంఘంబంతయు కళవళపడుచు నీవార్ధిదాఁట మన వలనగాదు. మారుతియొక్కఁడే తగినవాఁడని ప్రార్థింప వాయు తనూజుఁడుబ్బి పావనమూర్తియైన శ్రీరాముని పంపున నబ్ధిదాఁ టెదను. దేవవిరోధి దొంగిలించిన దేవిని జూచెదను. కనపడ కుండిన గడ్డతో లంకను బెఱికి తెచ్చెదను. అట్లుకానిచో రావ ణునేపట్టి తెచ్చెదను. అని వారికిఁజెప్పి తనతండ్రియైన వాయు దేవునకు, లోకబాంధవునకు, నింద్రునకు, సముద్రునకు నమ స్కరించి శ్రీరామలక్ష్మణులకుఁ దనమనస్సున మ్రొక్కి బంధు మిత్రులఁ గౌఁగిలించుకొని వారిచేత దీవనలంది గమనోన్ము ఖుండైయ్యెను.

ఇట్లెగిరిపోవు సమయమున నాతని కడ్డంబుగ మానవ రూపమున మైనాక పర్వతమును సురసయను నాగజననియు ఛాయాగ్రాహిణియైన సింహికయునుఁ గనుపట్టిన నెల్లర నతిక్ర మించి హనుమ సువేలాచలంబున కరిగి యచట నలతఁదీఱ నొకచోట నుండి యీరూపముతో లంకాపురిఁజొచ్చి సీతను వెదకుట కష్టమని యోచించి చీఁకటి పడినవెనుక సూక్ష్మ రూపముధరించి చొచ్చి మేడలు మిద్దెలు వీధులు గొందులు సందు లంతఃపురము లన్నియు వెతకి యెందును గానక రావ ణునిజూచి సీతయీనాడే మేనువిడిచెనో లేక రామునికిభయపడి

రావణుఁడు సీతనెచట దాఁచెనో యని యనేక విధములఁ జింతించుచు నొక్క గోపురం బెక్కి శింశుపావృక్షంబు క్రింద నమితశోకంబున నుండు సీతను గనుగొనెను.

వెంటనేయటకేగి శింశుపావృక్షంబెక్కి యనేకవిధంబులఁ జింతించుచు రామరామయని స్మరణచేయుట విని యామె సీతయేయని యతఁడు దృఢముగ నిశ్చయించెను. అప్పుడే యనేక శృంగారములు చేసికొని రావణుఁడేతెంచి యనేక విధముల నామెనుబతిమాలి, తన్ను గెలుచుటకు రామునివల్లఁగాదని భయపఱచి నోటికి వచ్చినట్లెల్ల ప్రేలెను. ఆనీచునామె తృణముగ భావించి, తృణము నడ్డముగనిడికొని పరదారాపేక్షతగదని బుద్ధిసెప్పి, రాముని శౌర్య ధైర్యంబుల బొగడ, వాఁడు గ్రుద్ధుఁడై మండిపడి యామెను జంపనుంకింపఁ గొందఱడ్డమునచ్చి శాంతవచనంబులఁ బ్రియంబుసెప్పిన రావణుఁడు మన్నించి కావలియున్న దనుజకాంతలతో నిరుమాసంబులు గడుపచ్చితి నొడఁబఱుపుఁడని వెడలెను.

ఆదుష్టుని దురాలాపంబుల, జానకి పాటులఁ జూచిన మారుతి మండిపడి యప్పుడే వానిని దుదముట్టింపఁదలఁచియు వెంటనే యీాదైత్యునిజంపితినేని సరి, లేకవీనిచేఁబడితినేని సీత యున్నతావు రామునికిఁదెలియుట కష్టము. రామునిసంగతి తెలియక సీతప్రాణములు విడుచును. కనుక నవసరపడఁదగదని యూరకుండెను.

అంతలోఁ జుట్టుకావలియున్న వారు కన్నుగూర్కిరి. వారిలో త్రిజటయను నిశాచరి మేల్కాని ప్రక్కనున్న వారిని లేపి నేనొక కలగంటిని. త్వరలో రాముఁడు రాగలఁడు. మన లంకకు చేటువాటిల్లఁగలదు. కావున మీరీమెను కఠినోక్తులాడకుఁడు అని మందలించెను. వారిట్లు మాటలాడుచు నందఱు మరల నిద్రించిరి.

అప్పుడు మారుతి మనుష్య భాషతో అమ్మా! భయపడకుము. శ్రీరామమూర్తి సుఖముగనున్నాఁడు. త్వరలో కపులఁగూర్చుకొని రానున్నాఁడు. నీచెఱమాన్చి కొనిపోనున్నాఁడు. అన సీతయు శింశుపావృక్షమందు సూక్ష్మరూపమున నున్న హనుమంతునిజూచి యిది దనుజమాయయని యూరకుండెను. దాని నెఱిఁగిన మారుతి యామెముందు దుమికి చేతులు మోడ్చి మ్రొక్కి అమ్మా! శ్రీరామమూర్తి మాల్యవంతమ్మునుండి మమ్మందఱ నన్నివైపులకుఁబంప నేనిందు వచ్చితి. నమ్మికకై నాచేతికి తనయుంగరమిచ్చిపంపెను అనిపలుకు నతని వచనముల నమ్మక రాముఁడెట్టివాఁడో చెప్పుమని యడిగెను.

అప్పుడువాయుపుత్రుఁడు రఘురామునికి వందనంబాచరించి ఆయనరూపగుణగణముల వర్ణించి తన పుట్టుక వర్ణించి చెప్ప నామె సంతసించి నీనిజరూపముగనఁబఱుపుమన నతఁడు శరీరమును భూమ్యాకాశములకు నొక్కటిగ పెంచి మరల సూక్ష్మరూపముధరించి నమస్కరింప నాదేవిశిరోరత్నం బను

గ్రహించి శ్రీరామమూర్తి క్షేమము నాకుచెప్పినందువలనను నాపాట్లు నీవు శ్రీరామమూర్తికిఁ జెప్పఁబోవుటచేతను దీనికిఁదగిన ప్రత్యుపకారమునేను చేయలేను. నీవు చిరంజీవివై వర్ధిల్లు మనెను.

అంత నాంజనేయుఁడా దేవికి మ్రొక్కి మరలిపోవునపుడు తనరాక రావణున కెఱింగింపఁదలఁచి మేడలు భూమిమట్టము చేసి, వనమును నిర్వనముగావించి, వచటికావలివారలైన యెనిమిదివేల రాక్షసులను జంపగా సీతకుకావలియున్న స్త్రీలు భయపడి రావణుని యొద్దకుపోయి మర్కటచేష్టల విన్నవించిరి.

అంత రావణుఁడతనిని రాముదూతఁగా భావించిచంపుటకై పదివేల రాక్షసులఁ బంపెను. వచ్చిన దానవసైన్యము నంతయు నొక్కనిమిషమున మారుతి తోకతోఁ జుట్టికొట్టెను. అందులో జావకమిగిలిన కొందఱేగి యసురేశ్వరుని కెఱింగింప నతఁడు మండిపడి పింగళాక్షుని, దీర్ఘజిహ్వుని, నశ్మవక్షుని, శార్దూలముఖుని, వక్రనాసునిఁబంప వారు తమతమ బలంబులఁ గూడి పోయితాఁకి సమసిరి.

మిగిలిన యొకరిద్దఱు మరల సంగతి నెఱింగింప దశముఖుఁడు వరుసగ నార్వుర మంత్రులఁ బంపె. తరువాత జంబుమాలినిబంపె, వారును మొదటి వారేగినత్రోవ నేగిరి. అక్షకుమారుని బంప వాఁడును నట్లుగాఁగ మేఘనాదుని బంపెను.

వాఁడమితాట్టహాసముతో నేగి యనేకాస్త్ర శస్త్రంబులఁ బ్రయోగింప వానినంతయు వాయుపుత్రుండు వాలంబున దునుమాడ, నింక వీనిచే ఫలములేదని బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. అంత నాంజనేయుఁడు బ్రహ్మమంత్రము పఠింప నది యతనిఁజంపక కట్టివైచెను. బ్రహ్మాస్త్రముచేఁ గట్టబడిన యాంజనేయు నింద్రజిత్తు రావణునొద్దకుఁగొనిపోయెను.

రావణుఁ డాంజనేయునిజూచి నీవెవ్వఁడవు? నీప్రభువెవ్వఁడు? నీపేరేది? నీవెవ్వరి ప్రాపున నీవనమంతయుఁ బాడుచేసితివి? నీవెవరి సాహాయ్యముచే నీరాక్షసులనందఱఁ బరిమార్చితివి? అని మహాకోపముతో నడుగురావణుని మాటల సరకుగొనక హనుమంతుఁ డిట్లనియె. నేనినతనయుని మంత్రిని. రామచంద్రుని దూతను. వాయుపుత్రుఁడను. హనుమంతుఁడను. శ్రీరామమూర్తి క్షేమమును సీత కెఱింగించి నేను వచ్చిన సంగతి నీకు తెలియుటకై నీవనముపాడు చేసితి. నన్నెదిరించిన వారిని యమునివద్దకుఁ బంపితి. నిన్నుఁ జూచిపోవలయునని కట్టువడి యిచటికి వచ్చితిని. నేను జెప్పుబుద్ధి వినుము. శ్రీరామమూర్తికి సీతనిచ్చి శరణు వేఁడుము.

అని చెప్పఁగా దైత్యకుల నాయకుఁడు మండిపడి యతనిం జంపుటకు భటుల కనుజ్ఞనీయ విభీషణుండు దూతను జంపుట నీతిగాదు. తోఁకకు నిప్పంటింపుమన వారట్లు గావించిరి. ఇదేయదనని హనుమ మేడలఁ మిద్దెలపైకి లంఘించి

యొక్కటి తప్పక నన్నిటి నగ్ని కాహుతిచేసి తోఁకఁ జల్లార్చు కొని సీతకుఁ దన వృత్తాంతంబెఱింగించి నమస్కరించి మరలె.

సింహనాదము సేయుచువచ్చి యాంజనేయుఁడు వానరులెదురువచ్చి కౌఁగిలించి కుశలప్రశ్నంబులుసేయ వారికందఱి కుజవాబిచ్చి వేవేగ శ్రీరామమూర్తిని సమీపించి సీత తెఱఁగె ఱింగించి యామెయిచ్చిన శిరోరత్నంబు సమర్పించెను. శ్రీరామచంద్రుఁడప్పుడు శోకించి సుగ్రీవునకు లంకాప్రయాణమున కనుజ్ఞ యొసఁగెను. అతఁడెనుబదికోట్ల సేనానాయకుల నియోగించ వారొక్కొక్కరు నూఱేసి కోట్లబలంబులతోవచ్చి రామచంద్రునిరువంకలఁగొలుచుచు మాల్యవంతమునుండి వెడలి సముద్రతీరమున విడిసిరి. రాముఁడచట సముద్రతరణోపాయం బాలోచించుచుండెను.

లంకాపురిమున విభీషణుఁడు రావణుని కనేకవిధముల బుద్ధిచెప్ప నవి రోగికి పథ్యమురుచించనట్లు రుచింపకపోవుటచే వాఁడుతమ్ముని నక్షీమపగులఁదన్నెను. ఇంకనచట నిలువఁదగదని విభీషణుఁడు తల్లికిమ్రొక్కి సముద్రతీరమున విచారగ్రస్తుండై న శ్రీరామచంద్రుని శరణుచొచ్చెను. శ్రీరామచంద్రుఁడంత విభీషణునిజేరఁదీసి భయముఁబాపి యతనివైరి ప్రభావంబు నెఱింగి సముద్రమునకు వారధిగట్టి లంకాపురంబుఁజొచ్చెను. అదియెఱిఁగినరావణుండు చింతాక్రాంతుఁడై దేవాంతక, నరాంతక, అతికాయ, త్రిశిర, మహోదర, మహాపార్శ్వాదుల

బిలిచి రామలక్ష్మణులఁ జంపి వారిశిరంబులఁ గొనిరండనిపంప వారరుదెంచి తమశిరంబుల రామలక్ష్మణుల బాణంబులకే యర్పించిరి. మిగిలినయతికాయుఁడరుదెంచి జరిగినది రావణుని కెఱింగింప నతఁడు కుంభకర్ణుని మేల్కొలిపి పంపెను. రఘు వీరుఁడు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి వానిశిరంబుఁద్రుంచె. అంత నతికాయుఁడువిజృంభింప లక్ష్మణుండు వారుణాస్త్రమున నతికాయుని శిరంబుద్రుంచె. హతశేషులు రావణునిజేరి మొఱలిడ నతఁడువారిపై కింద్రజిత్తుని పంపె.

ఇంద్రజిత్తు వేగపడఁ తెంచి బ్రహ్మాస్త్రము ప్రయోగించి హనుమంతుని విభీషణునిదప్ప నందఱిని మూర్ఛాగతులఁజేసె. అంతఁబ్రొద్దుగ్రుంక విభీషణుఁడు జాంబవంతునిగని యుపాయ ము చెప్పుమన నతడు హనుమంతుని బంపి సంజీవిఁ దెప్పింపు మన వాయునందనుఁడేగి సంజీవిపర్వతమే దెచ్చి సకలసైన్యంబు ప్రాణంబులఁగాచి నిమిషమాత్రమున మరలకొండ నాదోటఁ జేర్చివచ్చె.

అంతనింద్రజిత్తు రావణుఁడుదప్ప తక్కినసేనయంతయు రూపుమాపెను. అప్పుడింద్రజిత్తుఁడేగి మహాపౌరుషమునఁబోరి సౌమిత్రిచే హతుఁడయ్యెను. రాముఁడు తమ్ముని కౌఁగిలించి నీచేత వీఁడు తెగెను; నాచేత దశముఖుఁడు తెగుట నిజమని చెప్పెను.

చారులరుదెంచి సౌమిత్రిచే నింద్రజిత్తుఁడీల్గెనుచు

జెప్పరావణుఁడు కొడుకుందలఁచుకొని యనేకవిధముల విలపించి ధైర్యమువహించి తానే యుద్ధసన్నద్ధుఁడై వెడలె. అప్పుడిరు వాఁగుల వారికి యుద్ధము ఘోరముగ జరిగె. వానరు లందఱు తరుగిరి పాషాణపాణులై తేరుల విఱుగఁగొట్టియు రథంబుల చూర్ణంబులు చేసియు సేనల రూపుమాపియు యుద్ధంబుసేయుతఱి విభీషణుఁడు రావణుని రథంబువిఱుగఁ గొట్ట, వాఁడు భూమిపై కుఱికి మయదత్తంబైన శక్తినిబూని తమ్మునివేయఁ జూచునంతలో లక్ష్మణుఁ డడ్డంబై తనవెనుక విభీషణుని నిలువఁబెట్టుకొనె. ఆశక్తి సౌమిత్రియురంబు నాటె. ఆదెబ్బతో లక్ష్మణుఁడు మూర్ఛిల్ల రామచంద్రుఁడు తమ్ముని యురమునాటిన శక్తిని నూడఁదీసివైచి వానరుల కాపుంచి తాను గయ్యమునకు దిగె.

శ్రీరామమూర్తి శరలాఘవమున కాఁగలేక రావణుఁడు పరుగిడెను. అంత మూర్ఛాగతుఁడైన తమ్మునిఁజూచి విలపించు రామునోదార్చి మరల హనుమంతుఁడరిగి సంజీవి పర్వతముఁదెచ్చెను. సుషేణుండందలి దివ్యౌషధములవలన సౌమిత్రిప్రాణంబులఁ దేర్చెను. అట దశకంఠుఁడు రణజయార్థము పాతాళగుహాలో హోమము సేయుచుండ నాహోమధూమము గని విభీషణుఁడు భూకాంతునితో మాయన్న హోమము చేయుచున్నాఁడు. ఆహోమము తుదముట్టెనేనివాని గెలుచుట కష్టము. ఆహోమముఁ జెఱుపఁ గపుల బంపుమన నతఁడట్లు చేసె. ఆ కపిసంఘము గుహా జొచ్చి రావణుననేక విధముల

కదలించి హోమద్రవ్యంబుల పాడుచేసి కదలకున్న మండోదరి నెండ్రుకలుపట్టి యీడ్చితెచ్చి రావణుని ముందునిలుప నామె యనేకవిధముల విలసింప లజ్జచేనాతఁడు మహోగ్రాకారుండై లేచి దగ్ధశేషకాండంబులచే వానరుల శిరంబులు ముక్కులు చెవులు చెడఁగొట్టి తఱుము వారు రామభూకాంతున కా సంగతి యెఱిఁగించిరి.

రావణుఁడప్పుడు మండోదరితో నీవేల వగచెదవు? ఈవేళ రణమునందు నేనైనను జచ్చెదను. లేక రామునైనను గెలిచెదనని ప్రతిజ్ఞచేసి బయలువెడలి రామచంద్రు నెదిరించెను. ఇరుకెలంకుల నతిరోషమున యుద్ధముజేసి యనేకవీరులు మడిసినపిదప రామ రావణులెదురైరి. రథముపై రావణుం డును పృథివీస్థలి రామభూపాలుఁడు నుండి రణముచేయుట తగదని మాతలిచేతఁ గవచము, రథము, చాపము, శరము మొదలగునవి దేవేంద్రుఁడంపెను. ఆరథముపై నెక్కి రాముఁ డు రావణు నెదిరించి యనేక విధముల రణమొనర్చెను. ఎన్ని మారులు ద్రుంచిన నన్నిమారులు మరల రావణునకు తలలు పుట్టుచుండెను.

అప్పుడు విభీషణుఁడు రామునకు రావణుని నాభీమూలంబుననున్న యమృతము నగ్నిబాణముచే తెగవేసిన పిమ్మట నూటతొమ్మిదిమాఱులీ విధముగ నఱకిన తరువాత వాఁడు తెగునని విన్నవింప రామ భూపాలుండట్లు గావించెను.

అంత రావణుని తల తెగి క్రిందపడ దేవతలు పూవుల వర్షంబు గురిపించిరి. జగత్కంటకుఁడగు రావణుఁడు గూలుటచే నఖిలలోకంబు లానందమొందెను. అయిన భాతృభావంబున విభీషణుఁడు తన యన్న పదంబులపైఁబడి యనేక విధంబుల పొక్కిపొక్కి యేడ్చె. మఱియు మండోదరి మొదలైన యంతఃపుర కాంతలేతెంచి రావణాసురుపైఁబడి బహువిధంబులఁ బ్రలాపించిరి.

అంత శ్రీరామచంద్రుఁడు విభీషణుని దుఃఖం బుడిపి మీయన్న కగ్నిసంస్కారాది విధుల నాచరింపుమన యట్లు గావించిన పిదప విభీషణునికి లంకానగరంబు పట్టంబుగట్టి యీవార్త భూపుత్రి కెఱింగించి సీకాంతలచే నలంకరించి పిలుచుకొని రమ్మని చెప్ప నావిధ విభీషణుఁడొనర్చ రామచంద్రుఁడు తన వనితారత్నంబునుగని భార్య నెత్తుకొని పోయిన శత్రువును గెలువ లేదను లోకాపవాదమునకై యింతచేసితి. సీవింక నిచ్చవచ్చిన చోటికిఁ బొమ్మనెను.

ఆపలుకులు ములుకులై యామెకర్ణరంధ్రములఁజొరనప్పుడే యామెయగ్ని గావించి యందుఁజొచ్చె. సురలుస్తుతింప పద్మభవుఁడు ప్రత్యక్షమై సీతపరమపావని కైకొమ్మని చెప్పె. దశరథుఁడు ప్రత్యక్షమై భార్యతోతమ్మునితో శ్రీరామచంద్రుఁడు మ్రొక్క దీవన లిచ్చి చనెను. వచ్చినదేవత లందఱు స్తుతించి యరిగినపిదప రాముఁడు వానరబలంబులఁ

గూడి విభీషణునితో లక్ష్మణునితో జానకితోఁ బుష్పకంబెక్కి వారు సంగ్రామమొనరించిన చోటును, సువేలాచలంబును, సేతుబంధనంబును, విభీషణుఁడు శరణుచొచ్చిన చోటును, వాలిఁగూల్చినతావును, ఋశ్యమూకాచలంబును, పంపాసరోవరంబును, కబంధుని ద్రుంచినచోటును, జటాయువు మడిసిన స్థానంబును, మాయామృగంబును బడనేసినచోటును, శూర్పణఖ నవమానపఱచిన ప్రదేశమును, విరాధుండు సీతను గొనిపోయిన తావును, చిత్రకూటాచలమును, గంగానదిని సీతకు వేర్వేర విశదీకరించుచు పుష్పకమునుండి దిగి భరద్వాజమునీంద్రునికి నమస్కరించి యాతనిచే దీవనలంది ముందుగా తమ రాక తెలుపుటకై హనుమంతుని భరతునొద్దకుఁబంపి తామా రాత్రియందునిలిచి మజ్జనభోజనాదు లాచరించి మఱునాఁడమ్మునీంద్రుని వీడ్కొని శ్రీరామచంద్రుఁడు పుష్పకారూఢుండై బయలుదేఱెను. అంతలో హనుమంతునివలన నెఱిఁగిన భరతుఁడు సకలసేనలఁ గూర్చుకొని తల్లులతో రామునకెదురేగెను. రాముఁడు పుష్పకముదిగి దానికర్చనలిచ్చి కుబేరు వీటికిఁబంపి యెల్లరఁదగిన రీతుల గౌరవించుచు భరతు మందిరంబుఁ బ్రవేశించె.

తరువాత నలువురన్నదమ్ములు తపోవేషములు దీసివైచి రాజచిహ్నములు ధరించి దానవ వానరబలంబులఁ గూడుకొని షడ్రసోపేతముగ భుజించి యారాత్రిగడపి మఱునాఁడయోధ్యాపుర ప్రవేశముచేసిరి. వసిష్ఠాను మతంబున శుభముహూర

మున భద్రసింహాసనమున పట్టభద్రుండై రామభద్రుండు భూసురులకు దానంబులిచ్చి యర్థుల కిష్టార్థంబులిచ్చి విభీషణ సుగ్రీవాదులఁ బ్రియవచనంబులఁ దనిపి వారివారికిఁదగిన కానుకలిచ్చి నిజస్థానంబుల కనిపె. అశ్వమేధ యాగములుచేసి దివిజులందఱు మెచ్చునట్లు పదునొకండు వేలేండ్లు ధరనేలి రామరాజ్యమని ప్రజలెల్లరు నేటికిని పొగడ విలసిల్లె.

ఇట్టి శ్రీరామ చంద్రుని గన్నవీరమాత కౌసల్యను మఱచుమానవులు గలరా?.



శ్రీకృష్ణాయనమః.

# పరశురామునితల్లి

---

## పరశురాముఁడు.

నారాయణుఁడు తొల్లి యంబరీషుని రక్షించివచ్చి మునులందఱు చుట్టుగొల్వ శేషశయ్యపైఁ బవ్వళించియుండ మహాత్మా! నీశౌర్యధైర్యాది గుణంబుల వినుతింప మేమెంత వారమని పొగడు మునుల పలుకుల విని గర్వంబుచేఁ గన్నుగానక చక్రము, నానిశిత సహస్రముఖంబుల వైరివీరులఁ దును మాడనిచో మీప్రభువుగతి యేమగును? నావేయి ముఖంబులు వేయిచేతులుగాఁ జేసికొని మీచతుర్బాహుని పొంకమడంచెదఁ జూడుఁ డనెను. అంత నారాయణుండు ఓ! యున్మత్త ప్రలాపీ! నీవేయిచేతుల నాయొక్క చేతిచే ఖడింపకున్న నన్నీ నామంబున బిలువకుమని శపథముచేసెను.

అంత నారాయణుండు పరశురాముఁడై చక్రము కార్తవీర్యార్జునుఁడై జన్మించిరి.

గంగానదీ తీరమున నొక యాశ్రమమందు జమదగ్ని మహాముని నివసించుచుండెను. అతనికి నలుగురు కొడుకులు అందు నాలవవాఁడు రాముఁడు. అతనికి చిన్నతనమునుం

డియు ధనుర్విద్యయం దాసక్తి మెండు. కాన నీశ్వరునిగూర్చి తపముచేసి గండ్రగొడ్డలి బహుమతిగాఁ గొనెను. ఎన్నియా యుధముల నుపయోగించినను గండ్రగొడ్డలి నేమఱకుండుటచే నాతనికి పరశురాముఁడను పేరు సార్థకమయ్యెను.

హైహాయవంశమున సుదర్శనాంశమునఁ గృతవీర్యునకు సహస్రకరయుతుండగు కార్తవీర్యార్జునుఁడుదయించెను. అతఁడు తండ్రి తరువాత రాజై చక్కఁగా రాజ్యపాలన చేయుచు దత్తాత్రేయుని సేవించి యనేకవరములఁ బడసి తనకంటె నధికుఁ డెక్కఁడను లేఁడనుగర్వంబున విఱ్ఱవీఁగుచుండెను.

లంకాధిపతియగు రావణాసురుఁడు దిగ్విజయముచేయుటకు సర్వసన్నాహములు చేయుచు, కార్తవీర్యార్జునుఁడు రాజుల నందఱిని జయించి మదించి మాహిష్మతీపురమున నున్నవాఁడని విని యాపని సర్వసామాన్యనిగాఁదలఁచి కొంతసేన గొని మాహిష్మతీ పురసమీపమందు విడిసి యిష్టదైవమగు శివునిఁ బూజింప రేవానదీగట్టున పూజాద్రవ్యంబులఁగొని పూజించుచుండెను.

రావణుఁడిట్లుండఁ గార్తవీర్యార్జునుఁ డెండవేడిమికిఁదాళఁజాలక తనభార్యలతో రేవానదికేగి జలక్రీడలాడ నారంభించెను. అంతఁగార్తవీర్యుఁడు తనవేయికరంబుల నీటికడ్డముగ కట్టనేర్పఱుప నందు స్త్రీలు యథేచ్ఛగ జలక్రీడలాడుచుండిరి. ఇట్లు నిలువఁగట్టిన నీరంతకంత కెక్కువై గట్టులకెగఁబ్రాకిపొరలి

రావణుని సమీపించి పూజాద్రవ్యముల వెల్లువపాలుచేసెను. అంతరావణుఁడు త్రుళ్లిపడిలేచి పూజాద్రవ్యంబులు పాడై పోవఁ గొంతయూవలికరిగి వేసవికాల మెట్లీయేఱు పొరలివచ్చినదో కనుగొండని సేవకుల కాజ్ఞయొసఁగ వారు చెట్టునెక్కి చూచు చుండ నంతలో జలక్రీడలు చాలించి స్త్రీలందఱుపోడి వస్త్రములు ధరించుకొన్నతరువాతఁ గార్తవీర్యార్జునుఁడును గట్టున కు పోవనంత నేటినీరెప్పటివలెఁ దగ్గిపోవ నారంభించెను. ఆసంగతి సేవకులు రావణుని కెఱింగింప నతఁడమిత కోపానలతప్తుండగుచుఁ గార్తవీర్యార్జునునిపై యుద్ధమునకుఁబోయెను. అయిన నా వేయిచేతులవానియెదుట నీపదితలలవానిశక్తి లేవియు పనికి రాక పోయెను. కార్తవీర్యార్జునుఁడు రావణుని బట్టికట్టి పురమునకుఁ గొనిపోయెను.

రావణుఁడేమియుఁజేయలేక సిగ్గుచే తలవాల్చియుండఁ గార్తవీర్యార్జునుఁడు వానిని విడిపించి వానికి బుద్ధిసెప్పిపంపి తా నమిత బలాఢ్యుఁడని మిక్కిలి గర్వించెను.

ఇట్లుండ నొకనాఁడు కార్తవీర్యార్జునుఁడు వేఁటకై యడవికిపోయి యలసి జమదగ్నిముని యాశ్రమమునకువచ్చెను. రాజతిగర్వముచే నిండిన దుర్మార్గుఁడని తెలిసియు నాశ్రమమునకు వచ్చినవారికి నాతిథ్య మొసగకుండుట పాడిగాదని యమ్మునిపతి రాజునుప్రార్థించి యతనికిని నతనియనుచరులకును కామధేనుపుసాయమున సంతృప్తిగ భుజింపఁబెట్టెను. ఆహా! ఇట్టియావు రాజులకుండవలయును గాని మునులకెందుకని రాజు

తనయనుచరులతో నాయావుంబట్టితెండని యుత్తరువుచేసి తాను పట్టణమునకేగెను.

జమదగ్నియు నాతనిభార్యయు నెన్నివిధముల నలదని బతిమాలినను వినక అంబా! అని యావఱచుచుండినను విడువక దానినిబంధించి సేవకులు గొనిపోయి రాజునకొప్పఁజెప్పిరి.

అంత ఫలంబులు, సమిధలు, దర్భలుదెచ్చుటకై పోయిన పరశురాముఁ డాశ్రమమునకువచ్చి తలిదండ్రుల వలన సంగతి యిదియనిదెలిసికొని వివిధాయుధములఁతో గండ్రగొడ్డలిచేతఁ బట్టుకొని మాహిష్మతీ పురాభిముఖుఁడై పోయి నగరుప్రవేశించెను.

అట్లువచ్చిన పరశురాముని గార్తవీర్యార్జునుఁడుచూచి బాలుఁడు బాలునివలెనుండక రాజులతో జగడమునకువచ్చినాఁడు గనుక మనకింక పాపములేదు. మీరుయుద్ధమునకు సన్నద్ధులుగండని యుత్తరువుసేయ పదియేడక్షౌహిణులసేన పరశురాము నెదిరించె.

అంతపరశురాముఁడు చక్కఁగ వస్త్రము నెగఁగట్టి జందెము సవరించుకొని చెట్లఁగొట్టెడు కృషీవలునివలె పాదంబులు నఱకుచు, నరటికంబముల దెగఁగొట్టుతోఁట వానివలె మధ్యంబుల ద్రుంచుచు తాటికాయలరాల్చువానివలె శిరంబుల డుల్లనేయుచు మృగమాంసంబు వండుటకై నఱకెడు కటిక

వానివలె నవయవములఁ గొందికొంది వైచుచు సేనల నంప వానలో ముంచి రూపుమాపెను.

మేలు! ఈ బ్రాహ్మణుఁడొక్కఁడే యింతసైన్యమును నేలఁగూల్చెను. నేనేవీని నడఁగింప శక్తిగలవాఁడనని కార్త వీర్యుఁడొక యైదునూఱుచేతుల ధనురాది సాధనంబుల ధరించి వేఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడఁజేయుచు యుద్ధము నకుఁదొడఁగెను. పరశురాముఁ డంతట నొక్కబాణముచే రాజుయొక్క కోదండము లన్నిటిని విఱుగఁగొట్టెను. వాఁడంతట నూరకపోక వేయిచేతులతో వేయివృక్షముల పెల్లగించి రాము నిపై వేయ పరశురాముఁడంత తన కుఠారముచే వానివేయి చేతులను నఱకెను. చేతులన్నియు నఱకుటచే గిరిశిఖరమువలె వానిశిరమొక్కటినిలువ మరల దానిని తనపరశువుచేఁ తెగఁ గొట్టెను.

తండ్రి చనిపోఁగా కార్తవీర్యార్జునుని కొడుకులు పది వేవురు పరశురామునికి భయపడి పాఱిపోయిరి. తరువాత రా ముఁడు తనయావును దూడను తోలుకొని యాశ్రమమునకు వచ్చి తండ్రికి నమస్కరించి జరిగిన సంగతి విన్నవించెను.

జమదగ్ని:—నాయనా! ఎంతపనిచేసితివి! రాజునెవ రైనఁ జంపుదురా? రాజులేని రాజ్య మరాజకమగునుగదా?

రాము:—మనయావును దొంగిలించుటేగాక యావు నిమ్మనిన నన్నుఁజంపుట కతఁడురాఁదగునే?

జమదగ్ని:—అవును; రాజుతప్పుచేసినను మనమోర్వ వలయును. మనమోర్వకున్న జపతపము లేమేట గలుపుటకు? నీవింక నీపాపముపోవ బదులాడక తీర్థయాత్రచేయుము. అని చెప్పగా నతఁడొకయేఁడు తీర్థయాత్రచేసి వచ్చెను.

అంత నొకనాఁడు నీటికొఱకు రేణుకాదేవి గంగలోనికిఁ బోయి ప్రవాహమధ్యమున నచ్చరలతో జలక్రీడలాడు జిత్ర రథుఁడను గంధర్వరాజును వచ్చినపని మఱచి చేతనుండు బిందెను గట్టున నుంచి చూచుచుండెను.

తరువాతఁ గొంతసేపటికి తెలివిరాగా హోమమువేళ తప్పినది భర్తయేమనునో యనెడి భయముచే నీటిచే బిందె నింపుకొని వేవేగ చనుదెంచెను.

భార్యయాలస్య కారణమెఱిగి జమదగ్ని కొడుకులఁ బిలిచి తల్లిని చంప నుత్తరు వొసఁగెను. అయిన నామువ్వురు కొడుకులు తల్లిని చంపుట పాపంబని చంపకుండిరి. అంత రాముని బిలిచి యన్నలఁ దల్లిని నందఱిఁ జంప నుత్తరు వొసఁగెను. పరశురాముఁడు తండ్రియాజ్ఞ తలఁదాల్చి యందఱ నొకనిమిషమున నఱకివైచెను. అంతఁ దండ్రి సంతసించి రామునితో నీకేమి వరముకావలయునో కోరుమన, నాకన్నలు తల్లియుఁ గావలయునని రాముఁడడిగెను. ఇచ్చితినన వారలు క్రమ్మఱ జీవించిరి. అది యెఱిఁగియే పరశురాముఁడవ్విధమునఁ జేసె.

ఇట్లు కొంత కాలముకాఁగా కార్తవీర్యార్జునుని పుత్రులు పదివేలమంది పరశురామునికి భయపడి పాఱిపోయినను వారి మనముల యందలి క్రోధాగ్ని యాఱనందున సమయము వేచియుండి పరశురాముఁ డన్నలతో సమిధలకేగిన సమయము గని హోమాలయమందు సర్వేశ్వరు నారాధించుచున్న జమదగ్నిని రేణుకాదేవి యడ్డమేతెంచినను విడువక తలనఱికికొని పోయిరి. తండ్రిని జంపిన వైరంబుచే రాజకుమారులు మీ తండ్రిని జంపిరి రామా! రమ్మ! రాజులను దండించుటకు! అని (మూఁడేడులు) ఇరువది యొకమాఱు రేణుక ఱొమ్ము గొట్టుకొనియఱచెను.

తరువాత రాముఁడువచ్చి అమ్మా! దుఃఖింపకుము అన్నలారా! యూఱడిల్లుఁడు. నేనిదేపోయి యాక్షత్రియాధములఁ జంపి నాతండ్రి శిరంబుఁ దెచ్చెదనని చేత గండ్రగొడ్డలి గొని హైహాయపురముఁజొచ్చి కార్తవీర్యార్జునుని పుత్రుల తలలు నఱికి కొండలవలెఁ బ్రోగుచేసెను. రక్తము సెలయేఱులై పాఱ శమంత పంచకంబను తొమ్మిది మడుఁగులు చేసి తండ్రిశిరంబు దెచ్చి దేహముతోఁగూర్చి తండ్రికి నగ్నిసంస్కారముచేసి శమంత పంచకములోని రక్తముచే పితృతర్పణముచేసి క్రోధముచల్లాఱుటచేఁ దపోవనమునకుఁ బోయెను.

ఇట్లు పరశురాముఁడు తపముచేసికొనుచుండ విశ్వామిత్రుని మనుమఁడగు పరావసు వసురాజు దుర్నీతిపరుఁడై

గర్వాతిరేకమున తపంబు చేసికొనుచుండు పరశురామునితోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండెను.

ఒకనాఁ డతఁడనుచరులతో పరశురాముఁడు తపముచేయుచుండు స్థలమున కరిగి యితఁడేనా పరశురాముఁడు! ఎవరో కొందఱు పనికి మాలిన హైహయరాజకుమారుల వధించి జగత్తంతయు నరాజకంబు గావించితినని ప్రగల్భములు పల్కిన వాఁడీతఁడేనా! నిజముగ నట్టివాఁడైన నిప్పుడేల యిచట ముక్కుమూసికొని యుండుట! తపస్సను నెపంబున కన్నులు మూయుచుఁ దెఱచుచు రాజులకు వెఱచియేగదా యిచట నుండుట! అని పరావసువు పల్కుపల్కులకు పరశురాముఁడు కనులువిచ్చి తనకు వందనంబు లాచరింపక మోటువానివలె నిలిచియుండు పరావసువునుజూచి "రాజా! దుర్నీతి పరుఁడవై నన్నిట్లనఁదగునా? బ్రతుకఁదలచితివేని వచ్చినదారిన పొమ్ము." అనె.

పరావసువు:—వ్యర్థపు బ్రాహ్మణుఁడా! వట్టిప్రతిజ్ఞలు పలుకకుండిన నీకీ వనమధ్యమున దాఁగవలసిన పనిలేదుగదా?

పరశు:—ఏమీ! నేను వట్టిమాటలాడి నీవంటి క్షత్రియవీరుల కడలి యీవనమధ్యమున దాఁగితినా? బదులాడక పోకుంటివేని నాపరశువునకు బలియిచ్చెద.

పరా:—ఆహా! నీవంటి వీరుఁడలిగిన నాబ్రతుకువట్టిదే!

నీకొక్కనికేకాదు పరశు వుండుట. అడవులలోఁ గట్టెలు కొట్టుకొని జీవించు బోయవారికందఱికిని గలదు. మాటిమాటి కేల పరశువు పరశువని బెదరింపఁ జూచెదవు! మేము క్షత్రియులము!

మూర్ఖచిత్తా! నీ పొగరడగించెద నుండుమని పరశురాముఁడులేచి గండ్రగొడ్డలి చేతఁబట్టుకొని దుముక నిరువురికిఁ గొంత పెనగులాట జరిగెను. తుదకు పరావసువు చచ్చెను. అంత మరల కోపముదుగ కుండుటచే భూమి నక్షత్త్రిము చేయుటకై రాముఁ డిరువదొక్కమాఱులుభూప్రదిక్షణముచేసి వెదకివెదకి గర్భంబుననున్న రాచపిండమును సహితము వధించి యెప్పటివలె మరలఁ దపమున కరిగెను.

ఆసమయమున గంగాదేవి తనకుమారుఁడగు భీష్మునకు నస్త్రవిద్య నేర్పుమని విడువఁ బరశురాముఁడతనికి విద్యపరిపూర్తి చేసి పంపెను.

పరశురాముఁ డిట్లు రాజులనందఱిని చంపుటచేత దేశము రాజకమయ్యెను. అందువలన నన్నిధర్మములు తాఱుమాఱులై పాపభారముచే భూమి క్రుంగ మొదలిడెను. అపుడు కశ్యప మహాముని పుణ్యబలముచే పాతాళమున క్రుంగకుండ భూమిని తన యూరువులచే నెత్తినందున భూదేవికి కాశ్యపియనియు, ఉర్వియనియు పేరులు కలిగెను.

అంత కశ్యపముని పరశురామునియొద్దకుఁజని సమయో చితముగ ప్రాజలఁబడసి పరశురామా! క్షత్రియుల నందఱఁ జంపి దేశమంతయు స్వాధీనపఱచుకొంటివి. అయిన నీవిప్పు డశ్వమేధయాగముచేసిధన్యుఁడవు గమ్మన పరశురాముఁ డశ్వ మేధ యాగముచేసి భూమినంతయు కశ్యపునకు దానమిచ్చి సరస్వతియం దవబృథ స్నానముచేసి కిల్మిష హరుఁడాయెను.

నిఱుపేదయైన ద్రోణుఁడప్పుడు యాచ్ఞార్థ మరుదేరఁగా, పరశురాముఁడు విప్రోత్తమా! ఇప్పుడే నాకున్న సర్వమును బ్రా హ్మణుల కిచ్చితిని. ఇంకనాయొద్దనున్నది యస్త్రవిద్యయే! వలసియున్న దాని నీకు సమగ్రముగ నేర్పెద నన ద్రోణుఁడట్లే యని నేర్చుకొనివెడలెను.

అశ్వమేధయాగము పూర్తియైన తరువాత పరశురాము ని కింకను క్షత్రియులపైఁగల రోషమును గ్రహించిన కశ్య పుఁడు పరశురామునితో భూమినంతయు నాకు దారఁబోసితివి గనుక నీవిచటనుండక దక్షిణసముద్రతీరమునకు పొమ్మనెను.

పరశురాముఁడు దేశమంతయు దానమొసఁగి దక్షిణ తీరమునకుఁబోయిన పిదపఁ గశ్యపుఁడు పరశురామునిచేఁ జావక మిగిలిన రాజుల కందఱికి రాజ్యము పంచిపెట్టెను.

ఇట్లుకొన్ని శతాబ్దములు గడవ నయోధ్యా ధీశుఁడగు దశరథుఁడు తన కొడుకులగు రామలక్ష్మణభరత శత్రుఘ్ను

లను వివాహముచేయించి పిలుచుకొనివచ్చునపుడు భుజమున నమ్ములపొదియు నొకచేత గండ్రగొడ్డలియు ధరించిన భార్గవ రాముఁడు వారి కెదురయ్యెను.

అట్లు పరశురాముని జూడఁగనే దశరథునికి పై ప్రాణములు పై కెగసిపోయెను. అయిన నెట్లైన వేఁడుకొని రాముని కాపాడుకొనఁదలఁచి రాముని కడ్డముగ నిలఁబడి దశరథుఁడు భార్గవ రాముని స్తుతించుచుండ దశరథుని లక్ష్యపెట్టక యతఁడు రాముని వంకఁదిరిగి నీవు క్షత్రియుఁడవా? పైగా రాముఁడని పేరుపెట్టుకొంటివా? నాగురువగు శివునివిల్లు విఱిచితివా? అదిచాల ప్రాఁతదగుటచే త్రుప్పుపట్టియుండినందున దానిని విఱిచి విఱ్ఱవీఁగుచున్నావు. ఇదిగో నీకు బలముండిన నీ విష్ణుచాపమును విఱువుము. విఱిచితివేని నీ వొక మగవాఁడవని నీతో యుద్ధమునకుఁబూనెదను. అనఁగారాముఁడు భార్గవరాముని చేతి ధనువును గైకొని యెక్కుపెట్టెను. భార్గవరాముని చేతి చాపమును గైకొనునప్పుడే యాతని తేజము రామునియందుఁ బ్రవేశింప పరశురాముఁడు తేజోహీనుఁడయ్యెను.

అంత నెక్కుపెట్టి సంధించిన బాణముతో రాముఁడు పరశురాముని పాదములఁగొట్టెద ననగా పాదములఁగొట్టిన నేను తిరుగుటే కష్టమగును కనుక నా పుణ్యలోకముల దారి నరికట్టు మనెను. అట్లేచేసి రాముఁడయోధ్యఁజేరెను. పరశురాముఁడు మహేంద్రపర్వతముఁజేరెను. అచటనతఁడింకను తపమాచరించుచున్నాఁడు.

మహేంద్ర పర్వతమందుఁదపమాచరించుచున్న పరశురాముఁడొకనాఁడు హోత్రవాహనుని యాశ్రమమునకుఁబోయెను. చిన్ననాఁటిస్నేహితులు గనుక వారు కొంతసే పిష్టాగోష్ఠినుండిరి. అప్పుడొకకన్య యంబయనునది పరశురాముని యొద్దకువచ్చి కన్నులనీరుగాఱనేడ్చుచు స్వయంవరాలంకృతయగు నన్ను భీష్ముఁడెత్తుకొనిపోయెను. సాళ్వవిభుని వరించితినన తిరిగిపంపివేసెను. భీష్ముఁడెత్తుకొనిపోయెను గనుక నేను వివాహమాడనని సాళ్వవిభుఁడు నాతోఁజెప్పెను. మరల నేను భీష్మునొద్దకుపోవ, నీవు సాళ్వవిభునివరించితివి గనుక నాతమ్ముఁడొప్పుకొనఁ డనెను. ఇట్లుభయ భ్రష్టత్వము నొంది యిచట తపమాచరించి నాకసిఁదీర్చుకొన వచ్చినదానను. మిమ్ముఁగని పెద్దలు గనుక నాకుపాయము బోధింతురని తలఁచి మిమ్మువేఁడు చున్నా ననెను.

పరశురాముఁడంతయు విచారించి యంబ నోదార్చి భీష్ముఁడు నామాట నాదరించును. లేనియెడల వానిని నేను దండించెదనని చెప్పి కురుక్షేత్రమునకుఁబోయి భీష్ముని రప్పించి సంగతు లెఱింగించెను.

భీష్ముఁడు, అంబచెప్పినవిధమంతయు నొప్పుకొని నాతమ్ముఁడొప్పుకొననందున నామెను త్రిప్పి పంపవలసివచ్చినదనియు, నింక నేనేదియుఁజేయుటకు నీలులేదనియుఁజెప్పెను. అంత పరశురాముఁడాగ్రహించి యుద్ధమునకు నిలువ భీష్ముఁ

డును తల్లియానతిఁగొని యుద్ధమునకుఁ బూనెను. ఇరు వాగుల వారికి ఘోరముగ యుద్ధము జరిగెను. అందు పరశురాముఁడోడెను. అంతనతఁడు భీష్మునాదరించి యంబతోఁ దానేదియుఁ జేయలేమింజెప్పిపంపి తాను మహేంద్రపర్వతమునకుఁ దప మాచరింపఁబోయెను.

దుర్యోధనునిఁ ప్రియసఖుఁడైన కర్ణుఁడు ద్రోణాచార్యుని యొద్ద నర్జునునితో సమానమైన యస్త్రవిద్య సంపాదించి మఱియు నెక్కువ విద్యసంపాదించవలయునను నాసతోఁ జని, తాను క్షత్రియుఁడని చెప్పిన పరశురాముఁడు విద్యనేర్పఁడని, బ్రాహ్మణుఁ డని బొంకెను. పరశురాముఁడు సంతోషముతో విద్యనేర్పుచుండెను. అంత నింద్రుఁ డర్జునునికన్న మిన్నయగుచున్న కర్ణుని జూచి సహింపక యొకనాఁడు శిష్యుని తొడలపై తలనిడి పరశురాముఁడు నిద్రించుచుండ నిదియే సమయమని తానొకపురుగై కర్ణుని తొడ తొలువమొదలిడెను. గురువునకు నిద్రాభంగమగునని కర్ణుఁడోర్చియుండ రక్తప్రవాహముచే గుడ్డలన్నియుఁ దడిసిపోయెను. అంత పరశురాముఁడు మేల్కొని రక్తకారణమరసి నీవునిజముగ బ్రాహ్మణుఁడవా? అని గద్దించియడుగఁ గాదని కర్ణుఁడొప్పుకొని క్షమింపుమనెను. నీవు నన్ను మోసగించి విద్య సంపాదించితివి. ఆవిద్య నీ కాపదసమయమున పనికిరాకపోవునుగాక యని పరశురాముఁడు శపించి తపస్సుచేయఁబోయెను.

ఇట్టి శాప చాప శక్తిచే ప్రసిద్ధుఁడయిన పరశురాముని గన్న తల్లి కృతార్థురాలై వన్నెకెక్కెఁగదా!

శ్రీకృష్ణాయనమః

# భీముని తల్లి

## భీముడు.

పంచపాండవుల చరిత్రను తెలుపునది మహాభారతము. పాండవులలో మిగుల బలశాలి, మల్లయుద్ధమున సాటిలేని మేటి, రెండవవాఁడగు భీముఁడు. భీముఁడు పుట్టిన పదవదిన మున దేవతలకు మ్రొక్కుటకై పాండుభూపతియు, కుంతీ మహాదేవియు వెళ్లిరి. అప్పుడకస్మాత్తుగ నొకపులిపైఁబడ నుంకింపఁగా పాండుభూపతి దాని నొక్కకోలఁ గూలనేసెను. ఆశార్దూలమును గని మూర్ఛితయైన కుంతి, బిడ్డను చేయిజాఱ విడువఁగా నాబిడ్డ క్రిందపడుటచే రాళ్లు చూర్ణంబయ్యెనఁట!

పాండుభూపతి చనిపోయిన తరువాత పంచపాండవుల తో కుంతీదేవి ధృతరాష్ట్రునియొద్ద నుండవలసివచ్చెను. ధృ తరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులును, పాండు కుమా రులును గలిసి యాడుచుండునపుడు భీముఁడనిన తక్కినవారు గడగడ లాడుచుండెడివారు. పరుగుపందెము వేసినపుడు వా రొక్కొక్కరినెత్తుకొని పరుగిడునపుడు భీముఁడు పదుగురనెత్తు కొని యనాయాసముగఁ బరుగెత్తుచుండును. కుస్తీపందెమున పదుగు రెదిరించినను లక్ష్యపెట్టక పడఁద్రోయువాఁడు. జల

క్రీడలాడ గంగానదికి వెళ్లినపుడు దుర్యోధనాదుల నీటముంచి తిప్పలుపెట్టుచుండెడివాఁడు. కొందఱు చెట్టునెక్కి మామిడి పండ్లను గోయుచుండిన భీముఁడచటికి నెమ్మదిగ వెళ్లి చెట్టును బట్టుకొని యల్లలనాడింప మామిడి కాయలతోఁబాటు బాలురును నేలఁగూలుదురు. ఇట్లు భీముడు దుర్యోధనాదులఁ దన కొంటెపనులచేత బీడించుచుండినను, వారలకెప్పుడును హాని చేయఁదలపెట్టినవాఁడు గాఁడు. బాల్యచాపల్యమున నట్లు చేయుచుండెను.

ఏవిషయమందును భీమునితో సరిగా తూఁగలేకుండుటచే దుర్యోధనాదులకు భీమునియం దసూయజనించెను. భీముని గడతేర్పవలయునని, మాయోపాయము లెన్నియో చేయసాగిరి. ఒకనాఁడు భీముఁడందఱితోను గుస్తీపట్టియలసి నిద్రించుచుండఁ గాలుసేతులుగట్టి నీటఁద్రోయించిరి. నీటఁబడిన వెంటనే మెలఁకువరాగా భీముఁడొక్కనీల్గు నీల్గగ నా కట్లన్నియుఁదెగిపోయెను. భీముఁడీఁదుకొని గట్టుచేరెను. మఱియొక మాఱు భీముఁడొడలు మఱచి నిద్రించుచుండ సారథిచే కోడెనాగుఁబాములచేఁ గఱపించిరి. కాని యాతని వజ్రదేహమున కాటుదిగి విషమెక్కినదిగాదు. భీముఁడు మేల్కాంచి పాముల నన్నిటిని చీమలవలె నేలపై రాచిచంపెను. ఇంకొక మాఱన్నములో విషముకలిపిపెట్టించిరి. భీముఁడావిషమును జీర్ణించుకొనెను.

ఇందువలన భీమసేనుఁడు మొండిప్రాణము గలవాఁడని యంతకంటెను దారుణమైన విషప్రయోగము చేయఁదలఁచి యుపాయమాలోచించి, అందఱునుకలిసి వనవిహారార్థము గంగానదీతీరోద్యాన వనమునకుఁ బోదమని నిశ్చయించి మంచి వంట వారిని నిర్ణయించి కొన్నిభక్ష్యములయందు కాలకూట విషమునుంచి తయారుగావించిరి. తరువాత నందఱు గలిసి జలక్రీడ లాడుటకుముందు దుర్యోధనుఁడు మిగులప్రేమగలవానివలె భీమునినోట విషభక్ష్యములఁదుఱుమ నమాయికుఁడగుభీముఁడు వానిని మ్రింగెను.

చిఱుదిండియైన తరువాత రాజకుమారులందఱు గంగానదిలో జలక్రీడలాడ మొదలిడిరి. భీముఁడువారినందఱిని నీటిలో నాడించి ముంచి తిప్పలుపెట్టెను. ఎన్నివిధముల మాయోపాయములుచేసినను చావకుండుటచే దుర్యోధనునికి పాండవులపై పుట్టిన యీర్ష్యాబీజము మొలకలెత్తి పుష్పించి యెల్లెడల వ్యాపింపమొదలిడెను. ఏ విధముచేతనైన పాండవుల హాత మొనర్ప కృత నిశ్చయుఁడయ్యెను.

ధృతరాష్ట్రుఁడు బాలురకందఱకు ధనుర్విద్య చెప్పింపఁ దలఁచి ద్రోణాచార్యులయొద్దవిడిచెను. కొంతకాలంబునకు వారందఱు చక్కగా నేర్చుకొనిరి. కుమారులవిద్య పరీక్షింపఁ దలఁచిరంగస్థల మేర్పాటుగావింపఁబడెను. జనులందఱుచేరి జరుగఁబోవు పందెములఁజూచుటకు ముచ్చటపడుచుండిరి.

వారి వారికి తగిన వారితో వారు వారు భుజబలములఁజూపు చుండిరి. అంత భీముడును దుర్యోధనుఁడును గదాయుద్ధము నకుఁబూనిరి. చూపఱులు గొందఱు దుర్యోధనుని, కొందఱు భీముని బొగడుచుండుటచేత క్రోధము పెరుగు నను భయమున ద్రోణుఁడశ్వత్థామను బంపి వారి నివారించెను.

మాయోపాయములతో హతముసేయ వారణావతంబున లక్కయిల్లు కట్టింపఁబడెను. ఆగృహమున పాండవులు నివసించుటకుఁబంపఁబడిరి. ధర్మరాజాయింటినిజూచి తప్పక మాయ గృహమనియు దీని వలన నగ్నిభయము తప్పదనియు భీముని కెఱింగించెను. వారు దీనినికట్టించిన పురోచనుని దీనియందుంచి కాల్చి వెళ్లుదమని నిశ్చయించి యేమియు నెఱుఁగని యట్లు పగలువేఁటాడుచు రాత్రులం దాయుధహస్తులై పురోచనుని వంచించిమెలఁగుచుండిరి. విదురుని పంపున ఖనకుఁడను వాఁడు లక్కయిల్లు వెలువడ బిలముత్రవ్వి దుర్యోధనుని దుర్మంత్రఫలము కృష్ణ చతుర్దశి రాత్రికని యెఱింగించెను.

ఆకృష్ణచతుర్దశినాఁడు కుంతీదేవి యూరఁగల పుణ్యాంగనల కందఱ నిష్టాన్న సంతృప్తులఁజేసి దేవతలఁబూజించెను. పురోచనుని పంపున నొకదనుజకాంత తనయయిదుగురు కొడుకులతో వనమునుండి ఫల పుష్పములఁగొనియిచ్చుచు నచట జరుగు పనుల పురోచనునికి తెలియపఱచు చుండినది. అది నాఁటి రాత్రి తప్పఁ ద్రాగి కొడుకులతో నాయింటిలోనే నిదురించెను,

అర్ధరాత్రమున భీముఁడు పురోచనునికంటె ముందుగా లేచి వాని శయనాగారమునకు ముందు నిప్పంటించి యన్నదమ్ములఁ దల్లిని నెత్తికొని బిలద్వారము మూలమున బయటఁబడెను. ఆరాత్రి చిమ్మచీకటిగా నుండుటచేతను నిద్రాసమయ మగుట చేతను నడచుచు సహింపలేక తడఁబడుచున్న తల్లిని నన్నదమ్ములను పైనెక్కించుకొని మరల భీముడు తాళ్లు అప్పలు ముండ్లు గండ్లు వంకలు డొంకలు లెక్కపెట్టక నడచుటచే నడుగులక్రిందఁ బడినవన్నియు నలిగి నేల దిమ్మిసచేసినట్లు సమ మయ్యెను. అట్లునడచి యొకవటవృక్షము క్రింద వారిని విశ్రమింపఁజేసి తాను కావలి యుండెను. ఇంత భుజబలముండియు ధర్మరాజు విరోధమునకు సమ్మతింపకుండుట చేతఁగదా యింతకష్టమని యోచించుచుండెను.

భీముఁడిట్లు విచారపడుచుండగా నా యరణ్యనాయకుఁడైన హిడింబునకు మనుష్యవాసన వచ్చెను. ఆహా! ఇదియేటి వాసన! ప్రతిదినము మృగమాంసముదిని చవిచెడియున్న నా నోటికీవేళ విందు చిక్కినదని యనుకొనుచుఁ జెట్టునెక్కి పాండవులఁగాంచి ఆహా! నాభాగ్యమే భాగ్యము! నేటి కెట్టియాహారము చిక్కినది! వీరింకెట్లు తప్పించుకొనిపోదురు! వంటింటి కుందేళ్లవంటి వారైరి. అని సంతోషించుచు తనచెల్లెలగు హిడింబనుబంపి వారినిచంపి తనకు వండిపెట్ట నాజ్ఞాపించెను.

హిడింబయు చప్పుడుగాక యరుదెంచి చెట్టు క్రిందఁ

గూర్చుండి యాలోచనా మగ్నుఁడైన భీమునిఁజూచి మోహించి కామరూపిణి గనుక చక్కని స్త్రీ రూపము ధరించి భీమసేనుని సమీపించెను.

భీమ:—నీవెవ్వరిదానవు? ఎందుండి యిందువచ్చితివి? అర్ధ రాత్రమున వచ్చుటకుఁ గతంబేమి?

హిడి:—నేనీవనాధికారియైన హిడింబుఁడను రాక్షసుని చెల్లెలిని. మాయన్న యానతిచే మిమ్మందఱను చంపి వండుటకై వచ్చితిని. అయిన నిన్ను చూడఁగనే నా మనంబున పతిగా వరించితిఁ గనుక నన్ను వివాహ మాడుము.

భీమ:—ఇదిగో నిద్రించుచున్న యీతఁడు మాయన్న. అతనికి వివాహము కాకమునుపు నేనాడను. మఱియు నీవు రాక్షసకాంతవు. నేను మనుష్యుఁడను. నీకు నాకు నెక్కడి సంబంధము?

హిడి:—ప్రభూ! నిన్నే నేను వలచితిని. నన్ను నీవు వివాహమాడిన సరి; లేకున్న ప్రాణత్యాగము చేసికొనెదను. వారల నందఱను లేపుము. మాయన్న రాకమునుపు మిమ్మచటికై నఁగొనిపోయెదను.

భీము:—నీయన్నకు వెఱచి, సుఖముగా నిద్రించుచున్న నాయన్నదమ్ములను తల్లిని లేపు మనుచున్నావా! సురాసురులు వచ్చినను నేనెదిరించఁగలను. నీవు వచ్చినదారినిపొమ్ము.

ఇట్లు హిడింబ వచ్చినపని మఱచి భీమునితో మాట లాడుచుండ హిడింబాసురుఁడు తనచెల్లె లింకను మరలి రాకుండుటచే కోపముతో పండ్లు పట పటఁగొఱుకుచు భీముని హిడింబను చంపవచ్చుచుండెను.

అప్పుడు హిడింబ తన యన్న తన్ను సహితము చంపునని భీముని మఱుఁగుఁజొచ్చెను. భీముఁడంత జడియకు మని యామెనోదార్చి హిడింబాసురుని గుక్కసీదచ్చుకొని పోయినట్లు కొంతదూర మీడ్చుకొనిపోయి చంపెను. ఆ రాక్షసుని బొబ్బల కులికిపడి సోదరులును తల్లియును మేల్కొని యన్నియుఁజూచి యాశ్చర్యపడిరి. తల్లి యనుమతిపై హిడింబను భీమసేనుఁడు పెండ్లియాడెను. తరువాత వారి కొక కుమారుఁ డుదయింప వానికి ఘటోత్కచుఁడను నామమిడిరి. తలచినపుడువచ్చి సాయముచేయుదునని చెప్పియందఱకు నమస్కరించి తల్లితో ఘటోత్కచుఁ డుత్తరాభిముఖుఁడై చనెను.

మఱికొంత కాలమునకు వారు దేశదేశములు దిరుగుచు నేకచక్రంబను నగ్రహారముఁజేరి బ్రాహ్మణ వేషధరులై యింటింటికి వెళ్లి మాధుకరమెత్తి తల్లియొద్దనీయఁగా నామె దానిని రెండు సమభాగములుచేసి యొకటి భీమునకిచ్చి రెండవ సగము నలువురు కొడుకులతో తాను భుజింపుచుండెను. వారు భిక్షకై యింటింటికి వెళ్లునపుడు రవితేజులైన వీరిని రాజ్యమేలనీక యెందుకిట్లు బ్రహ్మ భిక్షుకులఁజేసెనని యనని వారులేరు.

ఇట్లుండ నొకనాఁడు వారువిడిసిన బ్రాహ్మణగృహ మున రోదన ధ్వనులు వెలువడ కుంతీదేవి విని పాపము! వీరింట మనమిన్నిరోజులు తలఁదాచుకొనఁగలిగితిమి. ఎందుచే తనో యిట్టి యార్తనాదము? దీనిని దెలిసికొని చేతనైనంత ప్రత్యుపకారము సేయవలయునని చెప్ప, భీముఁడు తల్లీ! అది యేదియో తెలిసికొమ్మ. ఎంతకష్టమైనను నేను తీర్చెద నని చెప్ప, కుంతి యింటిలోనికరిగి సమయమరసి కారణమడుగ నాగృహస్థు, అమ్మా! నేనేమనిచెప్పుదును. ఇచటి కామడ దూరమున బకుండను రాక్షసుఁడుగలఁడు. వాఁడీ యూరికివచ్చి స్త్రీలని పురుషులని బాలురని బాలికలని వృద్ధులని భేదము లేక యందఱినిచంపి నాశము చేయుచున్నందున మేమందఱము గలిసి వానికొక నియమమేర్పఱచితిమి. అదేదనగా ఇలువరుసను ప్రతిదిన మొక మానిసి రెండెనుబోతులతో నొకబండెఁ డన్న మును వాఁడున్న చోటునకే పంపునట్లు నిర్ణయము. మాకీరోజున ఇలువరుసవచ్చినది. నాభార్యనుపంపనా? నాముద్దులకూఁతును బంపనా? నాచిన్నికుమారుని బంపనా! నేనువెళ్లనా? యని దుఃఖించుచున్నామని చెప్పెను.

అంత కుంతీదేవి, దీనికింత సంతాపమేల? నీ కొక్కఁడే కొడుకు. మఱియు వాఁడు కడుచిన్నవాఁడు. నా కేవురుగలరు. వారిలో నొక్కఁడు బలి గొనిపోఁగలడు. అనగా బ్రాహ్మణుఁడు హరిహరీ! యని చెవులు మూసికొని యతిథినైవచ్చిన వారిని జంపుటకుఁ బంపుటా? ఆదోషమెట్లు తీఱుట. అనఁగా

కుంతీదేవి నేనదియోజించక చెప్పినదానను గాను. ఆరాక్షసుని గెలువఁగల కుమారుఁడు నాకుఁగలఁడు. లేకున్న నూర్గురు కొడుకులున్నను తల్లికిభారముగాదు. ఇదివఱకెంగఱో రాక్షసులాతనిచేఁ జంపఁబడిరి. మహాబల పరాక్రముఁడు. మంత్రసిద్ధుఁడు. అనిభీమునికి వారినిజూపి యీబ్రాహ్మణు నాపద దీర్చి నామాట కాపాడు మనఁగా నతఁడమితోత్సాహముతో నుండెను.

ధర్మరాజాదులు భిక్షకు వెళ్లినవారువచ్చి మిగుల సంతోషముతో నున్నభీమునిజూచి కారణమడుగ తల్లి వివరించెను. అప్పుడు ధర్మరాజు అమ్మా! ఏమిసాహసము చేసితివి? ఒకరికొఱకు తనబిడ్డల జంపుకొను వారుగలరా? భీమునివలన గదా లక్కయింటిని దాఁటఁగలిగితిమి. హిడింబాసురుని బారిఁబడక తక్కితిమి. ఇతనివలనఁగదా ధార్తరాష్ట్రులు రేయింబవళ్లు నిద్రలేక కుందుచున్నారు. అట్టితమ్ముని రాక్షసుని కాహారముగ నిచ్చుట కెట్లు మనసొప్పెను?

అన కుంతీదేవి కుమారా! నేను భీమునిశక్తి నెఱుఁగక చేసినదానను గాను. భీముఁడుపుట్టిన పదవనాఁడు కొండపైఁబడగా పడినచోట రాళ్లు చూర్ణంబైనవి. వజ్రకాయుఁడు. శ్రమలేక రాక్షసునిజంపి పరమోప కారులైన యీబ్రాహ్మణులకేగాక చుట్టు పక్కముల కెంతయు నుపకారము చేయఁదగును. అనిచెప్ప కుంతీదేవి కారుణ్యబుద్ధికి ధర్మజుఁడు మెచ్చి సమ్మతించెను,

అంతవారు భీమసేనునికి కావలసిన పిండి వంటలు పెరుగు కడవలు నేతికడవలతో సంతృప్తిగ భుజింపఁబెట్టిరి. భక్ష్యాన్నములతో పరిపూర్ణమైన శకటమునకు దున్నలఁగూర్చి యాయ భీముఁడెక్కి దక్షిణాభిముఖుఁడై చనెను. బకుఁడున్న చోటికి కొంతదూరముననే దుర్గంధమున కేవగించి బండినాపి యారక్కసుని బిలుచుచు వాఁడు వచ్చునంతవఱకూరకుండనేల యని కాలుచేతులు గడుగుకొని యాచమనముచేసి తనవీపు బకునివైపుద్రిప్పికూర్చుండి యాయన్నమును గుమ్మడికాయలంత ముద్దలుచేసి తినమొదలిడెను.

అంతబకాసురుఁడు ప్రొద్దెక్కుటచే మిగులకోపముతో భీముఁడున్నచోటికి వచ్చి నాయన్నమేల తినెదవురా యని నొక గ్రుద్దుగ్రుద్దెను. వచ్చినరాక్షసునిఁ జూచి జడియక మాటాడక కొట్టినందులకు కలఁగక తినుచున్న భీ ముని సామాన్యుఁడు గాఁడని తలఁచి బకుఁడు సమీపమందున్న వృక్షము పెఱికి తెచ్చునంతలో నతఁడును శకటమందున్న యాహారమును ముగించి మనుష్యమాంసముచే క్రొవ్విన నీక్రొవ్వు నిదిగో క్రక్కించెద నని యుద్ధమునకు నిలిచెను. సమీపవృక్ష సముదాయ మంతయు సమయువఱకు వృక్షములతో యుద్ధముచేసి తరువాత మల్లయుద్ధమునకు తలపడిరి. కొంతసేపు పెనఁగి చివఱకు భీముఁడు బకాసురుని జంపెను. ప్రాణములు పోవునపుడు వాఁడఱచిన యఱపులకు వానిబంధువులు వచ్చిరి. వారికందఱికి భీముఁడు బుద్ధిచెప్పి బకుని కళేబర మీడ్చితెచ్చి

నగరద్వార సమీపమున వేసి నగరవాసుల కందఱకుచూపించెను. వారంద ఱా శవముఁగాంచి ముదమంది భీమసేనుని మనుష్య మాత్రునిగ నెంచరైరి. అన్న దమ్ములును తల్లియునాశీర్వదించిరి.

తరువాతఁ గొంతకాలమునకు పాండవులు పాంచాలమున కేగి మత్స్యయంత్రముగొట్టి ద్రౌపదిని వివాహమాడి ద్రుపదరాజునొద్ద సుఖముగనుండిరి. అప్పుడు దుర్యోధనుఁడు, ద్రుపదరాజు మిక్కిలి బలశాలి. అతని కుమారుఁడమిత బల పరాక్రముఁడు. వీరికిపాండవు లయిదుగు రల్లుండ్రు. వీరిమిత్రులు కృష్ణబలరాములు. వీరందఱేకమైన మనగతియేమని విచారించి వారియందు దయగలవానివలె వారిని బిలిపించి యర్ధ రాజ్యమొసఁగి ఖాండవప్రస్థమునకుఁ బంపెను.

తరువాత నారదోపదేశమున ధర్మరాజు రాజ సూయమను యాగముచేయ నిశ్చయించి కృష్ణుని రప్పింప నతఁడు వచ్చి ధర్మరాజును జూచి నీవు రాజసూయము చేయుటకు ముందు జరాసంధుని గెల్చి రాజులనెల్ల విడిపింపవలయును. నేను, భీముఁడు, అర్జునుఁడు, ముగ్గురుగలిసి వానిజయించి వచ్చెద మనఁగా ధర్మరాజు వానిపుట్టువెట్టిది? ఏలరాజులఁ జెఱఁబెట్టె ననఁగాఁ గృష్ణుఁడిట్లనియె.

బృహద్రథుండను మగధనాథుని కిరువురు భార్యలయ్యు బిడ్డలు లేనందున పుత్రార్థియై తపముచేయుచుండ చండకౌశికుఁ డనుముని యొక ఫల మభిమంత్రించి యొకపుత్త్రుండు గలుగునని

యియ్యె నతఁడుదాని నిరువురుభార్యలకు పంచిపెట్టెను. వారిరువురకు నెలలు నిండి యొకనాఁ డర్ధరాత్రమున చెఱిసగము బిడ్డను కనిరి. సగముబిడ్డల నేమిచేయలేక కోటద్వారముకడ దాదులు పాఱవైచిరి. ఆకోటను కాపాడు జరయను రక్కసి యాహారమునకై దిరుగుచు నొకముక్క దొరక దాని నెత్తుకొని కోటచుట్టుఁ దిరిగివచ్చిన తరువాతఁ దండమని తలఁచి తిరిగిరాఁగా మఱియొక ద్వారముకడ నింకొక ముక్కదొరక రెండు నొక్కటిగ చేర్చి యదిమి యెత్తబోవ నది యెత్తుటకు వీలుగాని భారముగఁదోఁచి బాలుఁడేడ్వ మొదలిడెను. ఆ బాలకుని రోదనధ్వని విని యంతఃపురమందున్న వారు రాఁగా నారాక్షసి, నేనీ కోటనుగాపాడు జరయను దానను. నాచేత నీ రెండు ముక్కలు సంధింపఁబడినవి గనుక వీనికి జరాసంధుఁడని నామమిడుఁడని చెప్ప వారట్లుచేసిరి. వానినిజంపుటకే యాయుధమును పనికిరాక యీశ్వరుఁడు వానికి వరమొసఁగియున్నాఁడు. కనుక భీమసేనుఁడు వానిని మల్లయుద్ధమునఁ గడతేర్చునని చెప్పి మఱియు బలశాలియైన యర్జునుని రక్షణబలము చేతను, వాయుపుత్రుఁడైన భీముని భుజబలము చేతను, నా నిర్మల నీతిబలముచేతను నీకేదియు నసాధ్యము కాదని ధర్మరాజును కృష్ణుఁడు ప్రోత్సహించెను.

అప్పుడు ధర్మరాజు తండ్రీ! నిన్నుఁబడసిన మా కసాధ్యములు గలవా? అయిన భీమార్జునులు నా కన్నులు నా మనస్సే కమలనాభుఁడు. వారి నెట్లు పాయఁగలనని చింతించి

మరల మనస్సు దిట్టపఱచుకొని వారిని దీవించి పంపెను.

అంత వారు ముగ్గురుగలిసి విప్ర వేషములతో గిరివ్రజ పురము ప్రవేశించి బలవంతముగ హారముల గొని ధరించి గంధములఁదు గొని జరాసంధుని మందిరంబుఁ జొచ్చిరి. వారిని బ్రాహ్మణులని తలఁచి పూజింప వచ్చిన జరాసంధుని పూజ లేవియు వారు గొనరైరి. అప్పుడు జరాసంధుఁడు మీ రెవ్వరు? ఏల నేఁజేయు పూజలఁగొనరని యడుగ నారాయణుఁ డిట్లనియె.

గంధపుష్పముల యందు లక్ష్మియుండుఁగావున వానిని బలవంతముగఁ దీసికొంటిమి. క్షత్రియవీరుల నందఱఁ జెఱఁ బెట్టి వధచేయుచు పశుపతిని పూజించిన లాభమేమి? నీవు నిర్దోషుల వధించు పాపమే గొప్పది. నేను కృష్ణుఁడను; ఇతఁడు భీముఁడు; అల్లతఁడర్జునుఁడు. చెఱయందుంచిన వారిని వదలె దవా? లేక మాలో నొకనితో మల్లయుద్ధమున గొప్పుకొనె దవా? యని యడుగ భీమునితో జరాసంధుఁడు మల్లయుద్ధమున గొప్పుకొనెను. ఇరువురు పెనఁగిరి. జరాసంధుని బలము తగ్గిన వెంటనే భీముడు జరాసంధుని వధించెను.

ఇట్లు భీముఁడు జరాసంధుని చంపి ఆగృహ సమీపం బున వైచి సర్వజన భయంకరుఁడై యున్నపు డరుణోదయ మయ్యెను. శ్రీకృష్ణుండు చెఱ యందున్న రాజుల విడిపించి

మగధదేశ ప్రజలకభయమిచ్చి జరాసంధుతనయుని సహదేవుని రాజ్యాభిషిక్తునిఁ జేసి భీమార్జునులఁ గూడి యింద్రప్రస్థపురాభిముఖుఁడాయెను.

తరువాత ధర్మరాజు రాజసూయ యాగము కృష్ణునానతిని నిర్విఘ్నముగ నెఱవేర్చెను. రాజసూయ యాగమైన తరువాత రాజులందఱు వెళ్లిరి. దుర్యోధనాదులు ధర్మరాజునకుఁగల గౌరవము, పలుకుబడి, సంపదనుజూచి యోర్వలేక వారి సంపద నపహరింపఁదలఁచి యొక సభాభవనము నిర్మించి దానిని చూచుటకని పాండవుల రప్పించిరి. అట్లు సభ వీక్షించుటకని వచ్చిన ధర్మరాజును మాయజూదమునకు పురికొల్పి శకునితోనాడించి సర్వమునోడించి ద్రౌపదిని సభకు నీడ్పించిరి. దుశ్శాసనుఁడామె తలవెంట్రుకలు పట్టియీడ్చి కట్టుబట్టలవిప్ప మొదలిడ నది కృష్ణ బలముచే తఱుఁగక లాగిన కొద్ది వచ్చుచుండెను.

భీముఁడాయతిమానుషకార్యముఁజూచి యోర్వలేక ద్రౌపదిని మానభంగము గావింపఁబూనినవాని ఱొమ్ముఁజీల్చి రక్తము ద్రావెదనని శపథముచేసెను.

నాతొడపైఁగూర్చుండిన నీకీపాటు లేదని సైగఁజేసిన దుర్యోధనుని తొడలు విఱుగఁ గొట్టెదనని ప్రతిజ్ఞచేసె. మాయజూదమందు నిశ్చయించిన ప్రకారము పండ్రెండు సంవత్సరము లరణ్యవాసమును నొక సంవత్సర మజ్ఞాత

వాసమును చేయుటకు పాండవు లడవికి వెడలిరి.

ఒకనాఁడు భీముఁడును ద్రౌపదియు విహరించుచుండ సహస్ర పత్ర కమల మొకటి ద్రౌపది ముందు పడెను. దాని యందమునకును గంధమునకును నాశ్చర్యపడి యిట్టి పువ్వులు దవ్వులనైనఁ గలవేని నాకుఁ గొన్ని తెచ్చి యీయవలయునని ద్రౌపది యడుగ, భీమసేనుఁ డక్కమలముఁ దెచ్చిన గాడ్పున కెదురేగెను. అట్లు చాలదూరమేగి కదళీవనముగని సరోవరం బున స్నానమాడి శంఖమునూద ఆశంఖారవము భూమ్యా కాశములునిండె. నిద్రించుచుండిన హనుమంతుఁడదరిపడి లేచి తన యనుజుని శంఖారవముగ నెఱిఁగి యడ్డముగ మహావృక్ష ములఁగూలఁద్రోసి తానడ్డముగఁబరుండి తోఁకతో నేలపైఁ గొట్ట నా శబ్దమునకు మృగములు గిరిగుహలకుఁ బరుగిడెను. ఆ యపూర్వ ధ్వనిని విని భీముఁడాశ్చర్యముతో కదళీవన మధ్యంబున శయనించిన వాని హనుమంతుని జూచి సింహ నాదమొనర్చెను. హనుమంతుఁడు మెల్లగ మేల్కొనిన వాని వలె కనులు విచ్చి, అయ్యా! జరా భారమునఁ గదలలేక యలసి నిద్రించువానిని కరుణ లేక మేల్కొలిపితివి. పశు పక్ష్యాదులకు నీతులు దెలియవు గాని మనుష్యులకుఁ దెలియ వా? మనుష్యు లెవ్వ రిచటికి రారు. నీవెట్లువచ్చితివి? ఇక పైకి పోలేవు. అమృత సమానములైన యీ ఫలముల నారగించి వెను దిరిగి పొమ్ము అనఁగా

నేను వాయుపుత్రుఁడను. నా పేరు భీముఁడం(డు. నీవు

దారి యొసఁగని పక్షమున పూర్వము హనుమంతుఁడు సము ద్రము దాఁటినట్లు నిన్నును నీ పర్వతమునుదాఁటి పోయెదననఁ గా హనుమంతుఁడేల సముద్రమును దాఁటెనో చెప్పుమన నతఁడు రామాయణ కథ చెప్పె. అంత హనుమంతుఁడు నేను చాల ముసలి వాఁడను లేవలేను. నా తోకఁనెత్తి దారి చేసి కొమ్మన భీముఁడది తృణప్రాయముగనెంచి నెడమచేతఁ గదలించి కదలకుండుటచే రెండు చేతులనెత్తి ప్రయోజనము లేక గర్వ ముడిగి సిగ్గుచే తలవాల్చి క్షమింపుమని నిలువ, హనుమంతుఁడు భీమునికి తన నిజరూపముఁజూప కురుపాండవ యుద్ధమందు అర్జునుని రథ ధ్వజమందుండి యతనికిఁదోడు పడెదనని చెప్పి సరోవర మార్గముఁజూపిపోయెను.

భీముఁడచటినుండి కుబేర వనముఁజొచ్చి సౌగంధి కమల సరోవరముఁగాంచి దానిని రక్షించుచుండిన పదివేల యక్షు లతో యుద్ధముచేసి గెలిచి పుష్పములఁదెచ్చి ద్రౌపది కిచ్చెను.

అంత నొకనాఁడు జటాసురుఁడను రక్కసుఁడు బ్రాహ్మ ణ రూపము ధరించి నేను పరశురాముని శిష్యుఁడనని సేవించు చుండెను. భీముడింటలేని సమయ మరసి రాక్షసాకారముతో వచ్చి ద్రౌపదిని ధర్మరాజును నకులుని వారి యాయుధముల తో నెత్తుకొని యతివేగముగఁ బరుగిడ, సహదేవుఁ డాసంగతి భీముని కెఱింగింప, త్వరితగతి నరుదెంచి జటాసురు నాపి నీకు బుద్ధిగలదేని వీరిని విడిచి ప్రాణంబులఁ గాపాడు కొనుము.

లేని యెడల బక, హిడింబ, కిమ్మీరులగతి నీకును గలుగు
నన, జటాసురుఁడు వారల విడిచి భీమసేను నెదిరించి చచ్చె
ను. వారందఱు క్షేమముగ స్వస్థానముఁ జేరిరి.

హిమాలయ ప్రాంత మందొకనాఁడు వాయు పుత్త్రుఁ
డు మృగయార్థము గ్రుమ్మఱు చుండ నొక పన్నగముచే
పట్టుపడెను. అమిత బలుఁడైనను నాపన్నగము పట్టు దప్పించు
కోలేక యాశ్చర్యపడి పన్నగ రాజా నీవెవ్వఁడవు? నిజముగ
నీవు సర్పమవు గావు. నేనెందఱనో జయించిన వాఁడనయ్యు
నీచే పట్టుపడుట యాశ్చర్యమని యడుగ, నాకిది వరలాభము.
ఎట్టి యున్నతబలసంపన్నులైనను నాచేఁ జిక్కిన బలహీను
లగుదురు. అని యా సర్పము చెప్పి తినప్రయత్నించు సమయ
మున తమ్ముఁడు రాక తడయకారణ మరయుటకై ధర్మరాజ
చటికె నచ్చి పాముచే పట్టునడి యున్న తమ్ముని జూచి,
మరల భుజగముతోడ అయ్యా! నీవెవ్వఁడవు? రాక్షసుఁడవో,
దేవతవో నేనెఱుఁగ. ఆహారార్థము నీకు కావలసినంత మృగ
మాంసమిచ్చెద. నీ కోరిక యెఱిఁగింపుమనఁగా నాయజగర
ము, నేను బ్రాహ్మణుల నవమానించి యగస్త్యమహామునిచే
శాపముఁ బొందితిని. మరల ప్రార్థింప నాపై దయపుట్టి నీ
విచ్చు ప్రశ్నలకు ధర్మజుఁ డెప్పు డుత్తరము చెప్పునో యప్పు
డు శాపవిముక్తుఁడవు కమ్మని యతఁడనుగ్రహించెను. నన్ను
నహుషుఁ డందురు. అనికొన్ని ప్రశ్నలియ్య వానికి సరియైన
జవాబులిచ్చి ధర్మజుఁడు తమ్ముని విడిపించు కొనిపోయెను.

పాండవులకు పండ్రెండేండ్లు అరణ్యవాసము పూర్తిగా వచ్చెను. మిగిలిన దొక్కటియే యజ్ఞాతవాసమే. అదియే మిగులఁ గష్టతరమైనది. తమ్మెంత మాత్ర మెరుకలెత్తఁగినను మరల పండ్రెండేండ్లు అరణ్యవాస మొకసంవత్సర మజ్ఞాతవాసము జరుపవలయును. కనుక వారందఱు విరాటరాజు నొద్ద మాఱు వేషములతో సేవజేయ నిశ్చయించిరి. ధర్మరాజు బ్రాహ్మణ వేషమున కంకుఁడను నామమున విరాటుని జేరెను. భీముఁడు వంటల వాఁడయ్యెను. అర్జునుఁడు పేడిరూపము దాల్చి విరాట రాజుకూఁతురగు నుత్తరకు నాట్యము నేర్పుచుండెను. నకులుఁడు దామగ్రంధి యను పేరున నశ్వశాల కధికారి యాయెను. సహదేవుఁడు తంత్రీపాలుడనుఁ పేరుతో గోపాలకుఁడాయెను. ద్రౌపది విరాటరాజు భార్యయగు సుధేష్ణయొద్ద సైరంధ్రిపని కొప్పుకొనెను.

ఇట్లుండ నొకనాఁడొక మల్లుఁడు రాజ సభకు వచ్చి నాతో మల్లయుద్ధము చేయువాఁడెవడేని యున్న పంపుఁడని భుజ మప్పళించెను. వానింజూచి మల్లులందఱు భయపడిరి. అంత కంకుఁడు మనవంటలవాఁ డెదిరించఁగలఁడని తెలుప రాజు భీముని బిలిపించి యుద్ధమునకు విడువ నతఁడొక క్షణమున వానిఁగొట్టి ధనము గెల్చి యచటి జనులకు పంచి పెట్టి తాను తనయెడకుఁ బోయెను.

ఇట్లు కొంత కాలము గడవ నొకనాఁడు విరాటుని బావమఱఁది కీచకుఁడనువాఁడు ద్రౌపదిని జూచి మోహించి

యామెననేక విధముల బాధించి తొందఱ పఱుప, నామె తన భంగపాటును భీమునితోఁజెప్పి పరితపించెను. మన మిప్పుడు తొందఱపడఁదగదు. మనల నొరులెఱింగిరేని మరల వనమున కరుగవలసి వచ్చును. ఒరులెఱుగకుండ కీచకుని సమయింప వలయునని వాయుజుండన వానిపగ తీర్చవేని నురినైన, నీట నైన, నగ్నినైన విషంబుననైన ప్రాణంబులు వాసెదనని ద్రౌపది దుఃఖింప, మరల రేపు వాఁడు నీయొద్దకు వచ్చిన నీ వొడఁబడినట్లు నటించి వానికి నర్తనశాల సంకేత స్థలముగా నిర్ణయింపుమని యతడు చెప్పెను. ద్రౌపది భీముని జూచి బక, హిడింబ, కిమ్మీరుల, జరాసంధాదుల సమయించిన యీ చేతులు నేటికి వంట కట్టెలెత్తుట కుపయోగపడుచున్నవి గదా యని దుఃఖించెను.

తరువాత భీముఁడోదార్చి పంప ద్రౌపది భీమవాక్య పరిపాలనకై సుధేష్ణ గృహమునఁ గనిపెట్టియుండ నుదయమున సింహబలుఁ డెదురయ్యెను. పాంచాలి వానికిఁ దా నిశ్చయించుకొన్నట్లు బోధింప వాఁడామె యురిని దగులుకొనెను.

తన కోర్కె యీడేఱినదని మిగుల సంతోషముతో సింహబలుఁ డరిగెను. అంత ద్రౌపది భీమునొద్దకుఁజని యా సంగతి వినిపింప భీముఁడు సంతసించి వాని నచ్చట మద మడచుటకు నిశ్చయించెను. ఇది పల్ల మిది మిట్ట యని నిశ్చయించుటకు కాని యట్లు చీకటులు గ్రమ్మ ద్రౌపదిని నర్తన శాలలో నొక వైపున నుండి చూడుమని గాడుపుపట్టి యామె నొకచో నిలిపి దానొక లోని తిన్నెపైఁబరుండెను.

అపు డమితోత్సాహముతో కీచకుఁడు వచ్చి చెయి సాచి ద్రౌపదిని బిలువ రోషకషాయిత నేత్రుఁడై భీముఁడు మల్ల యుద్ధమునకుఁ దొడఁగెను. తనయగపాటు నొరు లెఱుఁగుదురని సూతుఁడును సమయ భంగమగునని భీముడును గొంకుచు చప్పుడు గాక ఘూకవిమర్దనప్రహారములకుఁ దొడఁగి కొంత తడవు పెనఁగిరి. చివరకు భీముఁడు కీచకునిచంపి ముద్దగాఁజేసి ద్రౌపదికి చూపి తన దారినరిగెను. అంత ద్రౌపది కావలి వారల లేపి నాపతులగు గంధర్వులచే పాపాత్ముఁడగు సింహబలుఁడు మృతి నొందెనని చూప నుపకీచకులు నూర్గురు వచ్చి తమయన్న చావుకై యనేక విధముల దుఃఖించి కీచకుని శవముతో ద్రౌపదిని సహితము గట్టి కాల్చుటకై కాటి కెత్తు కొని పోవ, ద్రౌపది మొఱలిడ, భీముఁడు విని మరల కష్టము వచ్చినదని శ్మశాన వాటిక సమీపించి వృక్ష సముదాయము చే వారి నందఱిని సమయించి ద్రౌపదిని విడిపించెను.

అంత నజ్ఞాతవాస దీక్షయు ముగియఁగా నప్పటికి సంధి కుదుర నందున పదునెనిమిది రోజులు కురు పాండవయుద్ధము జరిగినది. దుశ్శాసనుని భీముఁడెదిరించి నేలఁ బడఁగొట్టి వాని పొట్టఁజీల్చి రక్తము ద్రావెను. తరువాత నతఁడు దుర్యోధనుని తో గదాయుద్ధముచేసి వానితొడలు విఱుగఁ గొట్టెను. ద్రౌప దిని తొడపై గూర్చుండు మని చెప్పిననాఁటి తనప్రతిజ్ఞ ల నిట్లు నెఱవేర్చుకొనెను.

ఇట్టి భీమబలుఁడగు భీముని గన్నతల్లి లోకమునఁ గీర్త నీయకదా!

శ్రీకృష్ణాయనమః

# కాముని గన్నతల్లి

## కాముఁడు.

శంబరాసురుఁడను రాక్షసుఁడు శ్రీకృష్ణమూర్తికి పట్టపు దేవియగు రుక్మిణీకాంతియం దుదయించు ప్రద్యుమ్నుని వలనఁ దనకాపద సంభవించునని యెఱిఁగిన వాఁడుగాన పుట్టిన పసిపాపనికి పాలిచ్చి రాఁబోవు నాపద నెఱుఁగక నిదురించిన రుక్మిణికిఁగాని తదితరులకుఁగాని దెలియక ప్రద్యుమ్న కుమారు నెత్తుకొని చంపుటకుఁ జేతులాడక సముద్రమునఁ బాఱ వైచి చనెను.

అయిన నీశు నాజ్ఞ వేఱు విధముగ నుండుటచే సముద్రమునఁబడిన బాలుని నొకచేఁప మ్రింగెను. కృష్ణమందిరమున వారు తల్లిప్రక్కన నుంచిన బాలుని నలుప్రక్కల వెతకి గానక దుఃఖించిరి. రుక్మిణీదేవి యనేక విధముల పలవింపనారంభించెను. ఓకుమారా? నిన్ను తొమ్మిది నెలలు మోయుటేగాని యేసుఖము నెఱుఁగ. చంకనిడుకొని ముద్దిడుటయో శిరంబు

దుప్పటయో నీతప్పటడుగుల యందము గనుటయో ముద్దు మాటల నాలకించుటయో నోచనైతినే? నీనిండుచంద్రుని నెమ్మోమము ముద్దుల నింపుభాగ్యము లేకపోయెనే? ఎట్టి క్రూరాత్ములో నిమిషంబులో నిన్నుఁగొనిపోయి యెట్లుగాసి పెట్టిరో! కనుగందవు. తల్లిని బాపిన కష్టాత్ముఁడెవఁడో పుట్టిపుట్టక మునుపు నీపై వైరమూనిన దెవ్వరో నీతండ్రికేవలెనే నీకును వైరులు గలరని నేనెఱుఁగనే?.

ఎఱిఁగియుండిన కన్నుగూర్కనుగదా? పాపపుఁ గూర్కు నాకెచటనుండి వచ్చెనో నీవియోగము నేనెట్లు సైరింతును! ముద్దుకుఱ్ఱా! నీభావి యోగము దైవజ్ఞులు మేలనిపల్కరేయని దుఃఖించుచుండ శుద్ధాంత కాంతాజనంబులు మిగుల సంతాపంబును బొందిరి. శ్రీకృష్ణుఁడు సర్వము మదిలో నెఱిఁగియు బంధువులతోఁగలిసి తానును దుఃఖించెను.

శంబరుఁడు సముద్రమున బాలుని బడవైచుటయు చేఁపమ్రింగుటయు నొక్కక్షణములో జరిగెను. చేఁపలను బట్ట నెంబడి వారొచోటికి తెప్పలు గట్టుకొని యరుదెంచి వలలు వేసిరి. మారుని మ్రింగిన జలచర మావలలోఁబడెను. ఆ చేఁపను జూచి జాలరులే యాశ్చర్యపడిన తక్కనవారి సంగతి చెప్ప నేల? దానిని వధించి యమ్మిన నెంతడబ్బు రాఁగలదు? పుడమి ఱేని కిచ్చిన నెక్కువధనము రాఁగలదని వారు దైత్య భూమీశు నొద్దకుఁ దీసికొనిచనిరి. దైవకృత్యమునకు మాఱుగలదా?

మీనంబుగని శంబరుండు మిగుల సంతసించి వారికి తృప్తిగ ధనము నిచ్చి దానిని వండుటకై వంటవారి యొద్ద కుంబంపెను.

పాకకారులా చేఁపను వ్రచ్చినపుడు తళతళమని కాంతులు పర్వ పూర్ణ చంద్రునిబోలు ముద్దు మొఖము కల యొక బాలుఁడు వెలువడెను. అంతఁ బాకకారులు మహాశ్చర్యముతో నాబాలుని శంబరాసురుని కొప్పగించిరి. అచట వేడుక చూచుచుండిన బాలురు కొందఱు మాయావతియను పేరుతో నిర్దుష్టచరిత్రంబున మాయావతియై రక్కసునకు ముఖ్య ప్రాణంబుగ నున్న రతిసతికడకుఁజని పాకాగారమున జరిగిన సంగతి నెఱిఁగించిరి.

రతీదేవియు నాబాలుని రూపరేఖా విలాసంబుల కబ్బురమంది కొంతతడవాలోచించి తన కర్మ పరిపాకంబునకుఁ గాలము సమీపించినదని నారదవాక్యంబులఁ దలఁచుచు నీ పసిపాపని పెంచుట కొఱకు నా కిమ్మని యా దనుజుని వేఁడుదునా? వేడిన నిచ్చునసరి; ఇయ్యక క్రౌర్యంబునకుఁ బూనినచో కార్య విఘాతం బవునను చుఁ జంతిలుచుండ నచటికి నారదముని యరుదెంచి రతీదేవితో ఓ మారుని కొమ్మా! ఈ కుమారుఁడు లక్ష్మీపుత్రుఁడైన మారుఁడు. మహావిష్ణువే శ్రీకృష్ణుఁడుగాను, లక్ష్మియే రుక్మిణిగాను బుట్టి నీ భర్తయైన మన్మథునే కొమరునిగాఁగాంచిరి. పుట్టి పుట్టక మునుపే యీ శంబరా

సురుఁడు మాయ చేత నీబిడ్డను దెచ్చి సముద్రమున వైవ దైవగతి నా బాలునొక మీనము మ్రింగె. దానిని జాలరులు బట్టి యిచటఁజేర్చిరి. కనుక నతిజాగరూకతతోఁవాని గాపాడు మని బోధించి చనెను.

అంత నామాయావతి మిగుల వెలగల భూషణముల ధరించి మనోహరములైన వసనంబులఁ గట్టి నిజరూప ముట్టి పడ శంబరు నొద్దకుఁజని దితిజాధీశ్వరా! నేఁ బుత్రశోక జనితోన్మాదనై దైవపూజల రేలుంబగళ్లు శ్రమపడుట నీవెఱుఁగుదువుగదా? నాపుణ్య పరిపాకంబున నీబాలుఁడు దొరకెనని తలంచెద. వీనినాకు సంతానముగ దయచేయుము. అనివేఁడగ నాశంబరుండామె మాటలుత్రోసివేయఁజాలక మారుఁడు తన్ను జంపువాఁడని యెఱుఁగక తాను సముద్రమునఁ బడవైచినది వీనినే యని తెలియక మెత్తఁబడి యాసతికి పెంచుకొనుటకై యిచ్చెను.

అంత రతియు శిశువు ననేకవిధంబుల జాగరూకతతోఁ బోషించుచుండ నతండు దినదిన ప్రవర్ధమానుండై యావన దశనుబొంది నిరుపమాన సౌందర్య గాంభీర్యస్థైర్య ధైర్య శీలాది విశేషంబుల వెలయుచుండెను. అప్పుడు తన కర్మపరిపాకంబునకుఁ గాలంబాసన్నమైనదని తెలిసిన రతి మారునొకనాఁ డుద్యానవనమునకుఁ దోడ్కొనిచని నాకుమారుఁడా! మారుఁడా! వినుము నీపూర్వకథయు నావృత్తాంతమును. అని యిట్లు చెప్పందొడఁగె.

దక్షప్రజాపతి తిరస్కారమునకు పాల్పడిన పార్వతి ప్రాణంబులు వాయ మహేశ్వరుఁడు కైలాసగిరి శిఖరమున ఘోరతపస్సు చేయుచుండ నాతపోగ్నికీల లందఱి మనస్సులు తల్లడమంద దుర్వారమై గ్రమ్ముకొనియె. దేవతలందఱు దిగులు పడిరి. దేవేంద్రుఁడు లోకమునకేయాపదయగునని తల్లడమంది సభఁగావించెను. దిక్పాలకులందఱు వచ్చిరి. వేశ్యాజనంబు పరివేష్టించియుండె. మునిగణంబులు తమతమ స్థానంబుల నుండ దేవగురువగు బృహస్పతి యరుదెంచి యుచితాసన మధి ష్ఠించె. అప్పుడు సురపతియందఱఁ దిలకించి పార్వతీపతియేల సభకురాలేదని ప్రశ్నింప సురలందఱేక కంఠమున పార్వతి కొఱకు తపస్సు చేయుచున్నాఁడు. ఆతపోగ్నికీలలు నల్గడల వ్యాపించినవి. దీనికెద్రోవ వెదకకున్న లోకంబంతయు నా యగ్నిదహింపక మానదు. మాకు దిక్కుఁజూపుమని యతనిం బ్రార్థించిరి.

అప్పుడు దేవతాధిపతి బృహస్పతి దిక్కుముఖుండై భక్తిచే నంజలిసేసి యేపదవిఁ బొందఁగోరెనో, యేయాపద రానున్నదో దీనిందొలంగఁ జేయునుపాయంబెద్దో దెలియం బల్కుమాయని విన్నవింప, ఈయుపాయముం బాపుకొన నీవ లనను నావలనను గానిపని. అయిన నీసుదతీ మణులవలన నగునని దెలియంబల్కె. దేవేంద్రుఁడంత నప్సరస్సంఘముగని మీలో నెవ్వతె హరుని తపమును దుపఁదగినదని యడిగి రంభవంకఁజూచి నీవే తగినదానవని నేనూహించెద. నీకొఱకుఁ

గదా స్వర్గంబునకుఁ బోవలయునని భూలోకవాసులందఱు వ్విళ్ళూఱుచుందురు. కనుక మీ రందఱు వేగచని హరుని ఘోరతపముఁ జెఱచి వేగరండని చెప్పెను.

అందఱు దిగులుపడి యిట్టిపనిమాకుఁ బెట్టుటసరియా? ఉగ్రుఁడైన రుద్రుఁడు తపము చేయుచుండుట! ఆతపముఁ జెఱుప నబలలేగుటయా? వచ్చిన వారినతఁడు మసిగావింపక మానునా? అచటికిపోయిన నదికడయే. తిరిగివచ్చుట కల్ల. మమ్మనుగ్రహింపవే. ఆదిభిక్షువై హాలాహలము మ్రింగువాఁడు, నిర్ధనుండై చెట్టు నీడల వసియించువాఁడు, కాలుసేతులు లేక మూలలోనుండెడివాఁడు, బోడిబాఁపలతోడఁ గూడి యాడెడు జోగి. విగత వస్త్రుఁడు విరూపాక్షుఁడు వికృత వేషుఁడైనవాఁడు, అంగిట విషము కనుల నింగలము గురియు చుండువాఁడు. అట్టివాని నెవ్వరైనఁ జేరఁబోదురా? ఇంతవఱకు నేకష్టము లేక నీ ప్రాపున బ్రతికినాము. ఇక నిష్టము లేకున్నను మమ్మెక్కడకైన పొమ్మన్నఁబోయెదము. కరుణ జూడుము. మా ప్రాణములాన, మేము మాత్రము మా జోగి యొద్దకుఁబోలేమని చెప్పిరి.

ఇక నేది త్రోవ? పంకజాక్షులచటికిఁబోవ వెఱచుచున్నారు. ఈ సంకటము దీర్చు పుణ్యాత్ములెవ్వరు? అని దిక్కులు దెలియక దేవవిభుఁడు సంకటపడుచుండ దేవతలందఱుఁగలసి మహావిష్ణు వొక్కఁడే దీని కుపాయము వెతకు

వాఁడు. అయినను పితామహులు పాలి కరిగి యెఱిఁగించిన మేలన నమరపతి వెంటనే రండు రండనుచు దేవతలతో గుమిగూడి సత్యలోకమున కేగెను. అచట వారు భారతీ పతిని గాంచి భక్తితో సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి కర కమలములు ముకుళించి ధాతవు, జీవి జీవనవిధాతవు, సర్వ సుపర్వ కోటికి నేతవు, ప్రాఁతవిద్యల ప్రణేతవు, తాతవు, భూతకోటి సంత్రాతవు, భక్త భవ్యఫల దాతవు, కల్మష జేతవు, వెండికొండపై ముక్కంటి తపము గావించుచున్నాఁడు. ఆ తపోగ్ని కీలలు లోకములఁ గాల్చుచున్నవి. పెద్దవాఁడవని నిన్నాశ్రయించితిమి. దీనికిఁ బ్రతి కృతి వెతకు మయ్యా! అని కుయ్యిడిరి.

రాయంచ నెక్కుజేఁడా మాటల నాలకించి యిది కొంచెపు పనిగాదు. సముద్రునికడ నిల్లఱికమున్న యల్లుని కడ కేగి విన్నవింతము. శివుని తపము మాన్ప నుపాయము వెతకు నతఁ డనుచు వెంటనే జలరుహాసంభవుండు త్రిదశ ప్రకరంబులఁగూడి చని పాలసముద్రముగని నీవలనఁ గదా హరుఁడు గరళ కంధరుఁడగుట. నీవలనఁగదా శ్రీ యుక్తుఁడై శౌరి చెలువుగాంచుట, నీవలనఁగదా యింద్రుడు వెలిగారు పై ఠీవి వెలయుట, నీవలనఁగదా నాకలోకము పలు సౌఖ్యములకు నాటపట్టగుటయని పొగడి హరినుద్దేశించి పుండరీకాక్షా! మమ్మాపదలనుండి కాపాడుట కొఱకై వేగరమ్ము. దయామయా! మా మొఱాలకింపుము. అని మొఱలిడ

నాలక్ష్మీపతి పక్షివాహనుఁడై వారికి ప్రత్యక్షమయ్యె. అట్లు ప్రత్యక్షమైన శౌరింగాంచి హర్ష భయసంభ్రమంబులు ముప్పిరిగొన దేవతలెల్ల వినయంబునఁ గరకమలంబులు ముకుళించి ధ్యానించి నమస్కరించి యిట్లనిరి.

జనకుం డవమానించుటచే నమితరోషంబున దేహత్యాగము చేసిన కాత్యాయని కొఱకతిఘోరంబుగ హరుఁడు తపము చేయ నాతపోగ్ని కీలలు నల్గడల వ్యాపించి లోకంబు నాశంబొనరింప నున్నవి. శరణుచొచ్చినారము, మమ్మేతీరునఁ గాపాడెదవో కాపాడుము తండ్రీ!

శరణార్థులఁ గాపాడఁ గంకణము ధరించినవాఁడు కావక విడుచునా? సురబృందములారా! మీరు వెఱవకుఁడు ఇంద్రా! నీకు వెఱవఁదగునా! మీరందఱు మీమీ నెలవుల కరుగుఁడు. నేను మీకష్టంబులఁ దొలఁగింతునని యభయం బిచ్చి శ్రీహరి గరుడవాహనారూఢుఁడై యంతర్ధానము నొందెను. అంత దేవతలందఱు భయంబుడిగి వారివారి నివాసంబులకుఁజని నిశ్చింతతో నుండిరి.

ఇట్లుండఁ గొంతకాలమునకు శిశిరఋతు వారంభమాయెను. చలి యందఱిని వడఁకింపఁజొచ్చెను. వేసవి కాలమందు వేసటఁబుట్టించు మూలకొట్లయందు జనులు పరుండ మొదలిడిరి. చిమటలుఁ గొట్టుచు మూలలఁబడియుండిన సా

లావల కష్టము మరియూద నెక్కువయ్యెను. నాకు నాకని యొకరియొద్దనుండి యింకొకరు కొసరి గైకొనెడి వీవనలు మూలలంజేరెను. మంచు మంచనుచు మించు మంచు మహిమ నెంచదరమా?

ఇట్లు శిశిరము ప్రారంభమైన వెంటనే యొకనాఁడు శ్రీ మహావిష్ణువు లక్ష్మితో జగంబు దుఃఖముఁ బాపుట కొఱకై నాకు మాఱుగ నీకడఁగొట్టు కుమారునిఁ బంపఁదల చితినని మనంబున సంకల్పించు నంతలో రతింగూడి మారుఁడు దయించెను. అమిత భక్తితో తల్లిఁదండ్రులకు ప్రదక్షిణము చేసి మ్రొక్కి లేచి నిలుచున్న యా కడఁగొట్టు కొమరుని పై తల్లి ప్రేమ యతిశయింప చేరఁదీసి తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని ముద్దిడెను.

జనకునిజూచి మారుఁ డతిభక్తియుక్తుఁడై

నన్నుఁ దలంచిన కారణమెఱింగింపుఁడన లక్ష్మీపతి, కుమారా! శివుని తపముఁ జెఱుప నావలనఁ గాకుండుటచే నీచేనగునని తలఁచితినన, తండ్రీ! నీవనుమానము మానుము. నాదు ప్రతిన వినుము. శివుని తపము గడియలోఁ జెఱుపకున్న నగ్ని జ్వాలలకు నాశరీరంబు సమర్పించెద నన పంకజనాభుఁడు సంత సమున పుత్రుని సంకల్పసిద్ధుండవు గమ్మని దీవించె. అంత నతఁడు తండ్రికి నమస్కరించి తల్లిపాదంబులకు సాగిలంబడ తల్లి నాభాగ్యమా! త్వరలో నీవు కార్యము దీర్చితండ్రికి సం,

తన మొనఁగూర్పుమని దీవించెను. అంత మదనుండు భార్య తో నతివేగమ్మున తండ్రి కోర్కె దీర్పఁ జనెను.

ఇట్లు వేగచనుచు రమాకుమారుఁడు శారికలు, మయూరములు, కీరములు పరివారములై కొల్వ తూణియుఁ బాణియుఁ గృపాణియు నై రథంబెక్కి చనుచుండ కన్నులే విల్లుగాఁ గలవాఁడును, హరికంటెను జక్కనివాఁడును, మేలైన వన్నెలుగల చిన్నవాఁడు నదిగో చనుచున్నాఁడని యందఱుచూచుచుండిరి. ఇవ్విధంబున సురలందఱు దన్నుఁజూచుచుండ రతీవల్లభుఁడు ప్రియవల్లభతో నిట్లనియె.

ప్రియురాలా! అదిగో నీతండ్రియగు చందమామ కూఁతునల్లుని జూచువేడుక నరుదెంచుచున్నాఁడు. చూడుము. అని వర్ణించు పతితో రతియిట్లనియె.

అక్కటా నాథా! నీవేదేదో చెప్పుచున్నావు కాని నామనస్సు మిగుల దుఃఖముచేత దిక్కులు తోఁపకున్నది. అనేక దుర్నిమిత్తములు పొడకట్టుచున్నవి. నాపైఁగరుణించి నామనవి యాలకించి నాకోర్కె యీడేర్చుము. నేఁటికి నీప్రయాణ మాపుము. చేటుమూడునని నామనస్సు దిగులు చెందుచున్నది. ఎడమ కన్నదరుచున్నది. ఎడమ భుజమదరుచున్నది. గౌళిస్వర్భానునిపైఁ బలుకుచున్నది. జయము నీకు గలుగదు. నాలుగుకాళ్ళ జంతువు మనము ప్రయాణమగు నప్పుడు తుమ్మినది. మనకెప్పుడు కాలముకాదు. ఇది యబద్ధ

ముగాదు. నిజముగఁ జెప్పుచున్నాను. శివునితపస్సు చెఱుప రేపుపోవచ్చును. నేఁడువలదు. అతఁడు ఉగ్రుఁడై లేచి శపించు నో లేక క్రూరదృష్టితోఁ జూచునో నామనవి వినుము. మన స్సుదిగులు పొందుచున్నది.

అని విలపించు భార్యనుజూచి మన్మథుఁ డిట్లనియె. లోలాక్షి తిలకమా! తలిదండ్రులతో నందఱు వినునట్లు తప ము చెఱచెదనంచుఁ బల్కి యిపుడు వెనుదిరిగిన జనులునవ్వరా శివుఁడు వృషభధ్వజుఁడైన నేను మకరధ్వజుఁడను. వాఁడు మూఁడంచుల వాలుగలవాఁడైన నేను వేయంచుల వాలు వాఁడను. తానుసర్వభూషణుఁడైన మనసైన్యముసర్వభుక్తిఁ. అతఁడు ముక్కంటియైన జలకరకంబు ముక్కంటిగాదా? పం చశస్త్రములకు దాను సంచలింపకున్న గేదంగి పువ్వులకైన సంచలింపఁడా? అని యిట్లు మాట్లాడుచు కైలాసగిరి సమీ పించెను. అచట యోగాభ్యాసమున నిమీలిత లోచనుఁడై దేవదారు వృక్షముక్రిందనున్న రుద్రుఁగాంచి బాలా! ఇతని తపము నేలపాలుగావించి నిముషములో తిరిగివచ్చెదను. నీవి చట నుండుమని రతినచట నిలిపి తాను శివునిదగ్గఱకుఁబోయి పుష్పబాణములు వేయఁ దొడగెను.

విరియం పఱ చుఱుక్కున గఱుక్కునఁ గ్రుచ్చుకొనఁ మన్మథానల దందహ్యమానమానసుండై చిత ంబుత లపాటు నెందఁ జిక్కఁబట్టనేరక యోగంబు త్యాగంబుఁజేసి మెల్లన కన్నుఁగవ విచ్చిచూచి తన యెదుటనున్న యించువిలుకానిఁ

గని రోషంబున మండిపడి నీవిసవిసలు నాయెదుటనా యని యుగ్రుండు హుంకరించి ఫాలనయనంబుఁ దెఱచిన మన్మథుండు భస్మీ భూతుండయ్యెను.

అప్పుడు వసుంధర కుమ్మర సారెపోలిక గిరగిరమని దిరిగెను. విధాత నిలువలేక సరస్వతిచేతి నూతగాఁగొనెను. చుక్కలు జలజలనేలపై రాలెను. లోకులందఱు చీకాకుఁజెం దిరి. మయూరములు కోకిలలు శారికలు వనమునఁబడి పరు గిడఁ జొచ్చెను. దీనిని గాంచిన రతీదేవి నాథునిఁగానక బోరు న నేడ్వఁ దొడఁగెను. మయూరకోగిల శారికలారా! ఎచటికిఁ బోవుచున్నారు? మారుని గానలపాలు చేయుటకేనా మీరం దఱు గలిసివచ్చినది. నానాథునిఁ జూపుఁడని యేడ్వఁదొడగె ను. ఎచటికిఁబోదును? గతియేది? ఎవరుప్రోతురు? నేనును నీవేగినత్రోవనేవచ్చెదను. సతులకు భృత్యులు, ధనము, హితులు, బంధువులు, గురువులు, ఎచటనైన దొరకుదురు గాని పతియెట్లుదొరకును? పతినిబాసిన సతులను జనులు హేయముగఁజూతురు. పతియుండిన సుతులుందురు. పతి యుండిన బంధువులు ధనముండును. పతినిబాసినఁ, గనిపెంచిన సుతులు సహితము నిర్లక్ష్యముగఁ జూతురు. ముండలని మబ్బులేని యెండలని పరిహాసము చేయుదురు. అని యనేక విధముల విలపించుచు హరునిజేరి హస్తయుగములు ముకు ళించి,

మహేశ్వరా? పూలంతోవేయుట నిన్నుపూజచేయుట గదా? అర్థనారీశ్వరుఁడుగా నుండియు సరగడియలోగా లోక

మెల్ల ముంచఁజూచెదవే. అక్కటా నిన్ను పెట్టు పోయుమని రట్టుసేయ లేదుగదా? నానాథుఁడు చంపునంత యెగ్గేమిచేసెను చెప్పుమా? మగనిని జంపితివేలయని యెన్ని మాఱులడిగిన నెంత వేఁడిన దయరాదా? నామగని జీవమిచ్చి మన్ననచేయుము. పార్వతీపతీ! నీకంత కోపముండిన మమ్ముద్దఱ నీ కోపాగ్ని పాలుసేయక నన్నేల వదలితివి? నా మంగళ సూత్రము రక్షించుట కొఱకై మంగళ దేవత కుమారుని బ్రతికించి నాకు మంగళము సేయుము సర్వమంగళకారీ! అని దుఃఖించి,

చంద్రునుద్దేశించి అయ్యో! తండ్రీ! భస్మమై కూలినపు డితరులవలె నీ వెట్లు చూచుచుంటివి? అల్లుఁడుగదా! వారింపరాదా! నీకూఁతువైధవ్యముఁ జూడఁగోరితివా? అని గంగాదేవి నుద్దేశించి పిండిబొమ్మనుజేసి పీటపైఁ బెట్టి యాడుబిడ్డ యనిన యదరిపడెనఁట. ఆట్లాడు బిడ్డతనముచేత వేడుకఁ జూచెదవా? అనిమరల హరునుద్దేశించి నిను నామనోహరుని బ్రదికించువఱకు బ్రతిమాలుచుండెదను. అనిగట్టిపట్టుపట్టి యనేకవిధముల విలపించు రతినిజూచి జాలిచే నాహరుఁడు నీమనోహరుఁడనంగుఁడై నీకుఁగనఁబడుచుండును. జన్మాంతరమున సశరీరుండై నిన్నేలును జింతపడకు. ఓఅబలా! తపసులకు సాధుజనులకు నపకారము చేయువా రీవిధమగుట విపరీతము కాదు. అనిచెప్పినఁ గొంతయూఱటఁ జెంది తత్కాల నిరీక్షణకొఱకెందేనిం జన నుద్దేశించియుండ నారదముని యచటి కరుదెంచెను.

వచ్చినమునికి సాష్టాంగదండము లర్పించి భయభక్తి తో నిలుచున్న రతికి నారదముని వనితా! ద్వాపరయుగమున వనజాక్షుఁడు కృష్ణుండై పుట్టి రుక్మిణిని బెండ్లియాడి నీధవుని కొడుకుఁగా గనును. పసిపాపండై యుండగనే శంబరుండరు దెంచి యాపాపని నెత్తుకొనిపోయి చంపుటకై సముద్రమునవై చును. వానినొక మీనము మ్రింగును. అంత చేపలవారు దానినిబట్టి శంబరుని కిత్తురు. నీవు తత్పురంబునకుఁజని శంబరు నాశ్రయించి యుండి నీమగని దక్కించుకొమ్మని దీవించి పున ర్దర్శనంబగునని యథేచ్ఛంజనియె. అంతనేను తపముచేయుచు కాలంబుకొఱకుఁ గనిపెట్టియుంటి.

హరి కృష్ణుండయ్యె. లక్ష్మి శ్రీరుక్మిణియయ్యె. నీవా వరదంపతులకుఁ బుట్టినపట్టివి. పురుటింటనే నిన్నుఁజంపుటకై శంబరుఁడు సముద్రమునవేసె. అటనుండి నీవు చేఁపకడుపునఁ బడియిచటఁ జేరితివి. నారద వాక్యంబుల ప్రకారము వానిని వేఁడి నిన్నుఁ గాపాడితిని. నిజముగ నీవునాప్రాణనాథుఁడవు. వెంటనే వీనిని సంహరించి నీకొఱకై విలపించు తలిదండ్రుల కడ కరుగుదమురమ్ము. అని హరితనయునకంతయు నెఱిం గించి శంబర వధోద్యోగమున నియమించి నిజపితృదత్తం బగు సర్వమాయా వినాశినియగు మహామాయనెఱింగించి సర్వ సాధనంబులుగూర్చి యిచ్చిన నతఁడు సంసిద్ధుండై శంబరుని యుద్ధంబునకుఁబిల్చె.

అట్లు పిల్చు కుమారునిఁ జూచి ఓరీ! కుమారా! నీవు నన్ను సంగరమున గెలువఁ గలవా? ఎవరీపనికి నిన్ను నియ

మించినవారు? నీపై ప్రేమచే నేఁజెప్పుమాటల వినుము. నీకు ప్రాణము గావలసియుండిన యుద్ధమునకు రావలదు మరలుము. ఆబిబ్బోకవతి నిన్నిట్లు ప్రేరేపించినదా? స్త్రీబుద్ధిః ప్రళయంకరీ యనుట నెఱుఁగవా? అనిన ప్రద్యుమ్న కుమారుఁడు ఓపలువా! పదర లాభమా! శిశుత్వమందు నన్నుదధిలో వైచి చంపఁ జూచితివి. నే నిప్పుడు రణమందు నిన్ను గెల్చెదను. బెదరక నిల్పుము. పుడమియందుఁ బెద్దపిన్నతనము లెన్ను టేల? పిడుగు చిన్నదైనను వ్రేటు చిన్నదగునా? మాయలు నాయొద్దఁ జెల్లవని రణంబునకుఁదొడంగె. వారికిఁగొంతతడవు పెనుపోరు వాటిల్లె. అపుడొక శరమురము నాఁట నెత్తురులు గ్రక్కుచు నేలపై శంబరుఁడు వ్రాలెను. చిగురాకు బాకుచేతను జగముల సొలయించు మేటి కత్తిఁగొని యొకని వ్రేయుట యొకవింతా?

దేవతలు పుష్పవర్షము గురిపించిరి. ఇట్లు శంబరుని వధించిన పతింగూడి రతీదేవి యోగబలముచే ద్వారకకే తెంచి వీథిని జనుచుండ వెన్నుఁడతఁడని యొకరన, వెన్నుఁడుగాఁడు పందెమెంతయని యింకొకరన, జలజాక్షుఁడైన నతని దగ్గఱ నున్నకాంత యెవ్వతె? శ్రీహరియైన నీసౌధంబెఱుఁగనట్లు గలయఁజూచుచున్నాఁడేమి? అని అందఱన్ని విధములఁ బలుకుచుండ రుక్మిణి వారిని జూడవచ్చెను.

రుక్మిణీదేవి ప్రద్యుమ్నుని జూచి యితని రూపరేఖా విలాసంబులఁజూచిన నా తనయునివలె నున్నాఁడు. ఇప్పు

చుండిన నాకుమారుఁడు నైతమింతవాఁడై యుండునుగదా? పాపాత్ముఁడెవ్వఁడో నా ప్రక్కను నిదురించు చిన్నిపాప నెత్తుకొనిపోయెను. అని యిట్లు దుఃఖించుచుండ వారా సౌధంబునకే వచ్చిరి. ఆసమయంబునఁ గృష్ణుఁడు బంధువులఁగూడి యచటికరుదెంచి చూచుచుండ నంతలో కలహాప్రియుఁడగు నారదుఁ డరుదెంచెను.

కృష్ణుఁడు వచ్చిన నారదు నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి యర్హాసనాసీనుగావించి కుశల ప్రశ్నంబుచేసి వీ రెవరో మీరిది వఱకుఁజూచియున్నారా? అని యడుగ,

కృష్ణా! వీరెవరని నన్నడుగుచున్నావే? నీవెఱుఁగని సంగతులుగలవా? జగదాధారుండవు. జీవిజీవితంబవు. నీకొడుకును గోడలును గదావీరు? అనిచెప్పి తనదారింజనెను.

నారదుని వలన తన కొడుకు కోడలని విన్న వెంటనే పాలకడలి పట్టికి మేన గగుర్పాటొదవెను. తదనంతరంబు వారలం జేరందీసి కొడుకును దొడలపై నిడికొని ముద్దిడి నాయనా! తల్లినెడఁబాపి యేనీచుఁడు నినుఁ గొనిపోయె? నీ వింతవఱ కెచటనుంటివి? నిన్నుఁబెంచిన పుణ్యాత్ములెవరు? ఈగజయానయెవతె? అని యడుగ నా రతీదేవి తన వృత్తాంతమంతయుఁజెప్ప, నానందనుని, నాభాగ్యమును, నానోములపంటను, నాముద్దుల తనయునిఁగాపాడి నన్నాలోకింపఁజేసిన పుణ్యాత్మురాలా! నిన్నేమని పొగడుదును? నీవు నాకోడలవు

గావు. నావంశమును నిలుపఁ బుట్టిన దేవతవు. ఇదివఱకెంద ఱో పతివ్రతామతల్లు లుండిరి గాని యివ్విధమున భర్తను గాపాడినవారు గలరా? అని కోడలి ననేకవిధములఁ బొగడి వారిరువురి కతివైభవమున వివాహము గావించి వారలకను వుగ వేర్వేఱు మేడలు గట్టించి ఇచ్చి సంతసించుచుండెను. చూచినవారి కనులకు ఇంపు పుట్టించుచు నందనందనుని నందనుఁ డానందమున నుండెఁ.

ఇట్టి కామునిగన్న తల్లియే తల్లి.



శ్రీకృష్ణాయనమః

# కృష్ణుని గన్నతల్లి.

## కృష్ణుఁడు.

ముందు యాదవులని యొకతెగ రాజులుండెడివారు. వారు చంద్రవంశజులు. వారి రాజధాని మధుర. దానిని శూరసేనుఁడను రాజు పాలించుచుండెను. అతని జ్యేష్ఠ కుమారుఁడు వసుదేవుఁడు. వసుదేవుని కెందఱో భార్యలు గలరు. అందులో ముఖ్యులు రోహిణి, దేవకీదేవి.

కంసుఁడు, జరాసంధుఁడు, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడు, సాల్వుఁడు, పౌండ్రక వాసుదేవుఁడు మొదలగు దుర్మార్గుల బాధ పడలేక ప్రజలు తల్లడిల్లుచుండిరి. మునుల జపతపములు కొనసాగవయ్యెను. వేయేల? ఏ పుణ్య కార్యమునకును స్థలములేక పాపమునిండెను. అప్పుడందఱు నారాయణా! వాసుదేవా! పరమపురుషా! భక్తవత్సలా! కరుణాకరా! అని మొదలిడ నారంభించిరి. శ్రీ మన్నారాయణుఁ డామొఱవిని దేవకీదేవి వసుదేవుల యష్టమ గర్భమున నుదయించి దుష్టుల బాధల నణఁప నిశ్చయించెను.

వసుదేవుఁడు దేవకీదేవిని పెండ్లియాడిన తరువాత తనగృహమునకు వెళ్లునపుడు కంసుఁడు తన సామర్థ్యము బావకు చూప రథము తానే నడుపుచుండెను. అప్పు డశరీర వాణి "మూర్ఖుఁడా! దేవకీదేవి యెనిమిదవగర్భము నినుఁ జంపు"నని చెప్పెను.

ఆమాటలు కదరిపడి కంసుఁడప్పుడే దేవకీదేవిని జంప నుంకింప వసుదేవుఁడడ్డమువచ్చి బావమఱంది చేతిని బట్టుకొని ముద్దులమఱఁదీ! ఏల నీవీలీల బేలవై యాడుది, చెల్లెలు, క్రొత్త పెండ్లికూఁతురనియైన నెంచక దీనిఁజంపఁదలపెట్టితివి. ఇట్టి కొంచెపుఁబని నీయట్టిధీరునికి తగునే? ఈమె పుత్త్రిల వలన నీప్రాణములకు భయమని యాకాశవాణి పలుకుల నమ్మిన, బిడ్డలు పుట్టుచుండఁగనే యెప్పటికప్పుడే నీయొద్దకుఁ దెచ్చియిచ్చెదను. నామాటనమ్మి విడువుమని బతిమాల కంసుఁడు విడిచెను.

అంతనొక సంవత్సరమున కొక బిడ్డవంతున దేవకీదేవి యెనిమిదిమంది కొడుకులను నొకకూఁతును గనెను. మొదటి కొడుకు పుట్టినవెంటనే సత్యవంతుఁడైన వసుదేవుఁడు చంపుట కై కంసునికిఁ దెచ్చియిచ్చెను. ఇట్లు సత్యము తప్పక కొడు కును దెచ్చియిచ్చినందులకు కంసుఁడు సంతసించి వీనివలన నాకు భయములేదు. నీవే కొనిపొమ్మనెను.

ఒకనాఁడు నారదుఁడు కంసునింటికివచ్చి కంసుని వలన పూజలఁగొని మందలోనున్న నందాదులు దేవతలనియు

కంసుఁడు రాక్షసు డనియు కంసునిఁజంప దేవకీదేవికడుపునఁ జక్రి పుట్టుననియుఁ జెప్పెను. అంత కంసుఁ డదరిపడి వెంటనే దేవకీవసుదేవులఁ జెఱయందుంచి వారు కనిన బిడ్డల నందఱిని జంపి తండ్రిని చెఱఁబెట్టి దేశమల్లకల్లోలము చేసెను.

చెఱయందున్న దేవకీదేవి కేడవగర్భము నిలిచెను. అప్పుడు హరి యోగమాయను బిలిచి నీవు నందగోకులమందున్న రోహిణీగర్భమున దేవకీదేవి గర్భమందున్న పిండమును జేర్పుము. నాపానుపైన శేషుఁడు బలరాముఁడను పేరుతో నట పుట్టి పెరుఁగును. నేను దేవకి యష్టమ గర్భమునఁ బుట్టెద నప్పుడు నీవు యశోదకు పుత్రికవై పుట్టుము అని చెప్పెను. సర్వేశ్వరుని యాజ్ఞప్రకారము యోగమాయ దేవకి గర్భము లోని పిండమును రోహిణి గర్భమునఁ జేర్చెను.

తరువాత దేవకీదేవి యష్టమగర్భము ధరించెను. ఆమె గర్భమున విశ్వగర్భుఁ డుండుటచే మిగుల ప్రకాశముతో వెలుఁగుచుండెను. ఆయద్భుత తేజమునుగని కంసుఁడు భయమందెను. కంసునికి విష్ణుచింత యెక్కువయ్యెను. నిద్రయందును విష్ణుని కలవరింతలే, శబ్దము హరిశబ్దమే. హరి యేవైపునుండి వచ్చి తన్ను జంపునోయని యులికిపడు చుండెను.

బ్రహ్మాదిదేవతలు మునులుగూడి దేవకీగర్భస్థుఁడగు శ్రీకృష్ణుని, ఆదినారాయణా! అమృతాబ్ధిశయన! వేదాంత వేద్య! గోవింద! ముకుంద! దుష్టశిక్షణ శిష్టపోషణార్థమై వేగ

రమ్ము. అని స్తుతించి తల్లీ! నీకడుపున ప్రధాన పురుషుఁ డు న్నాఁడు. నీకు కంసునివలని భయముతప్పినది. నీకేకాదు మాకు లోకమున కంతయు శుభముకలిగినది. అని యామెను దీవించి వెడలిరి.

మఱునాఁడర్ధరాత్రమున లోకంబంతయు నిద్రాధీనమై యుండ మహాతేజముతోఁ జతుర్బాహువులతో పుష్పమాలాలంకృతుఁడై శంఖచక్రగధాధరుఁడై హరిపుట్టెను. అట్లు పుట్టిన పట్టిని జూచి యనేకవిధముల దేవకీవసుదేవులు ఓదీన మందార! ఓదయాకరా! మాదేమిలేదెల్ల నీదేపరాత్పరా! అని సుతించిరి.

అంత నామహానుభావుఁడు, జననీజనకులతో వ్రేపల్లె యందు యశోదప్రక్కఁజేర్చి యానిసుఁగు నిచటఁ జేర్పుఁడని యుచెప్పి చిన్నబిడ్డయై తోఁచెను.

వసుదేవుఁడా బిడ్డను రొమ్మున నడ్డముగ నుంచుకొని చప్పుడుగాక బయలుదేఱ కాలిసంకెళ్లువీడె. తలుపుల తాళంబులూడె. యమున దారియొసఁగె. అంతవసుదేవుఁడు నిద్రించు గొల్లపల్లెఁజేరి యశోద ప్రక్కను చిన్నికృష్ణునుంచి యాయమ కూఁతునెత్తుకొని భగవంతుని మాయచే నిద్రించుచున్న కావలి వారల కావంతయుఁ దెలియక దేవకీదేవి ప్రక్కఁజేర్చెను. అంత కాళ్ళసంకెళ్ళుప్పటివలె ధరించి కొనెను.

ఆబాలిక పెద్దపెట్టున నేడ్వ నారంభించెను. కావలి వారు మేల్కాని తలుపుల తాళంబు లెప్పటివలె నుండుటగని కంసుని కావార్త యెఱింగించిరి. కంసుఁడంత చిడిముడి పాటుతో వెండ్రుకలూడ పై గుడ్డజాఱ బురుటింటిలోనికి జొరఁబడెను. అట్లు వచ్చు కంసునిగని, అన్నా! యిది యాఁడుపిల్ల అల్లుఁడుగాఁడు. ఆఱుగురు కొడుకులను జంపితివి. ఈయాఁడు పిల్లనైన నాకుండనిమ్మని యక్కునఁ జేర్చుకొని బతిమాలు చెల్లెలిని తిట్టి బలవంతముగ నామెచేతిలోని బిడ్డ నూడఁబెఱికి విసరి క్రిందవైవ నాబాలికయు క్రిందఁబడక పై కెగసి యాకసమున నిలిచి ఓరిదుర్మార్గుఁడా! దేవకిబిడ్డల నందఱిని జంపితివి. ఆఁడుబిడ్డనైన నన్ను సహితము చంప సమకట్టితివి. ఇదియా నీసాహసము? నీచుఁడా! నిన్నుఁ జంపెడివాఁడు మఱియొక చోట పెరుఁగుచున్నాఁడు. అని యంతర్ధాన మాయెను.

అంత కంసుఁడు దేవకీవసుదేవుల పాదములపైఁబడి మన్నింపవేఁడుకొని వారి కారాగృహవాసము దప్పించెను.

మఱునాఁడు కంసుఁడొక సభగావించి మంత్రుల రావించి జరిగిన సంగతి నెఱిగింప, వారు పుట్టిన బిడ్డలనందఱిని జంపిన నినుఁజంపువాఁడు సహితము చచ్చునని యోచన చెప్పిరి. సాధుపీడనము మంచిదిగాదని యోచించక క్రూరకార్యములకు మంత్రుల నియోగించెను.

అచట మందలో నందుఁడు కుమారుఁడు పుట్టినందుల కమితోత్సాహముతో రెండు లక్షల పాడియావుల కనక కల

శములతో తిలశైలంబు లేడింటిని భూదేవతలకు దానమి చ్చెను. కృష్ణుఁడని యాబాలునికి నామకరణము గావించెను.

కంసుఁడు బిడ్డలఁ జంపుటకై నియోగించిన వారిలో పూతనయను రక్కసి పల్లెల పట్టనముల కరుగుచు అందలి బిడ్డ లకుతాను విషపు పాలిచ్చుచు గోకులమునకువచ్చెను. అచట యశోదా రోహిణు లెంతవద్దనినను వినక చిన్నికృష్ణునెత్తుకొని పాలిచ్చెను. ఒక గ్రుక్కకుపాలు రెండవగ్రుక్కకు నెత్తుటిని పీల్చి మూఁడవ గ్రుక్కకు ప్రాణముల సహితము హరించెను. సుందర స్త్రీ రూపముననున్న పూతన కొండవలె క్రిందికొఱఁ గెను. కొండపై నిటునటు దిరుగుచున్న మాయబాలకుని యశోదా రోహిణులెత్తుకొని దృష్టిదీసిరి. అంత మధురనుండి వచ్చిన నందుఁడు వికృతాకృతితోఁ గూలియున్న పూతన శరీరమునుగాంచి వెఱఁగంది గొడ్డండ్లచే నఱికించి దూరంబున వైచికాల్పించెను.

అంతఁ గొన్నాళ్ళకు కృష్ణుఁడొదికిలఁ బడనేర్చెను. యశోద పండుగుచేసి ముత్తైదువులకు పసుపు కుంకుమ పంచు చుండెను. అప్పుడు నిదురించుచున్న చిన్నికృష్ణుఁడు నిదుర మేల్కొని పాదముల చెంతనున్న యొక బండిని తన్నగా నది మింటికెగసి క్రిందఁబడి ముక్కలుగ విఱిగెను. ఆబండి యట్లు విఱుగుటకు కారణంబేమని విచారింప బాలకుఁడు తన్నుటచే త ననిరి. చెంతనున్నవారు ఇదినమ్మఁదగినదా? బాలుఁడెక్కడ? తన్నుటేడ? యని యందఱాశ్చర్యపడిరి. అంత యశోద బాలుఁడేడ్చి యలసెనని పాలుత్రాగించెను.

ఒకనాఁడు యశోద కొడుకును తొడపై నిడుకొని బుజ్జగించి ముద్దిడునప్పుడు గొప్పకొండవలె బరువయ్యెను. తుదకు మోయలేక క్రిందికిదించి యితఁడు భూభారమును మానుపఁబుట్టిన మహాపురుషుఁడై యుండునని తలఁచెను.

అప్పుడు తృణావర్తుఁడను రక్కసుఁడు కంసు పంపున సుడిగాలియైవచ్చి కృష్ణుఁగొనిపోయెను. సుడిగాలికి కన్నులు మూసినవారు కన్నులు తెఱచునంతలో కృష్ణుఁడు కనపడఁడయ్యెను. అంతయశోద, అయ్యో! నాయనా! తండ్రీ! సుడిగాలికి చిక్కియెట్లు విలపించితివో నాముద్దుల కొడుకా! నేనిఁక నిన్ను కనులఁ జూడఁగలనే? నానోముల పంటా! నీవులేని నాబ్రతు కేటికి? యని యనేకవిధముల విలపించుచు నేలఁబడెను. అట్లు విలపించుతల్లిని జూచిన వారందఱు నట్లే విలపింప మొదలిడిరి.

ఇంటికి బాలుని గొనిపోయిన రాక్షసుఁడు మోయలేక యడుగైన కదల లేకుండెను. కృష్ణుఁడు వానిమెడ నొక్కిపట్టి క్రిందికి వ్రేలఁజొచ్చెను. అప్పుడువాఁడు తలక్రిందుగ ఱాతిపైఁబడి తలయుదేహము చిదుక చచ్చెను. కృష్ణునికే బాధయులేకుండెను. అప్పుడు గోపికలు చిన్ని కృష్ణునిదెచ్చి యశోదకిచ్చిరి.

మఱియొకనాఁడు చిన్నికృష్ణుఁడు మన్నుదినెనని తోడి బాలురుచెప్ప మన్నేలదింటివి? తినుట కింటఁ బదార్థములులేవా యనియడుగ, అమ్మా! నేనువెఱ్ఱినా? ఆకొంటినా! చూడు

మమ్మా! తినలేదని నోరుచూపించెను. యశోద పరీక్షించుట కై నోరుచూచెను. ఏమిచిత్రము? ప్రపంచమంతయు నందగప డెను. యశోద నిశ్చేష్టయై నిలిచి, ఏమిదికలయా? లేకవైష్ణవ మాయయా? నేను యశోదనుగానా? ఇంత చిన్నబాలుని నోట నింత బ్రహ్మాండ మడఁగియుండునా? అని వితర్కించు నంతలో నతఁడుమాయచే తల్లినిముంచెను. అంతలో యశోద బాలుని నోటఁగనఁబడిన కైలాసము వెన్నముద్ద యనియుభూభాగమును మట్టిపెల్లగాను పాల సముద్రమును తాను ద్రావిన పాలుగాను భావించి బాలుని కజీర్ణము చేసెనని నిశ్చయించెను.

మఱియొకనాఁడు యశోద పెరుగు చిలుకుచుండగా పాలిమ్మని నిర్బంధించెను. ఆమె పెరుగుచిలుకుట విడిచి పాలు ద్రావించుచుండ ప్రొయ్యిమీఁది పాలుపొంగువచ్చెను. దానినార్పఁబోఁగా కృష్ణుఁడు కోపముతో పెరుఁగుకుండ పగులఁ గొట్టెను. కోపముచే యశోద కృష్ణునికి బుద్ధి చెప్పఁ దలఁచి పట్టుకొనుటకై తఱుమఁగాఁ దిరిగితిరిగి యొకచోట దొరకెను. అంతనామె పట్టుకొని కట్టఁదలఁచి యెన్నిదారము లు ముడిపెట్టినను చాలకుండెను. బ్రహ్మాండ మంతయు నణఁ గిన పొట్టను కట్టుటకు సాధ్యమగునా? అయినను, తల్లిపడు కష్టముచూచి లీలావినోదుఁడు గనుక కట్టుటకు సాధ్యముగ పొట్టస్వాధీనపఱచెను. వేయేండ్లు తపస్సుచేసినను దొరకని వాఁడు యశోద కట్టులకులోఁబడెను. ఆహా! ఆమె భాగ్యమే భాగ్యము. ఆమహామహుని జలకమాడించి యొడలుతుడిచి యలంకరించి పాలిచ్చిన తల్లియే ధన్యురాలు!

యశోద కృష్ణుని నడుమునకుఁ గట్టిన దారమును ఱోటికిఁగట్టి తనపనిపై పోయెను. కృష్ణుఁడా ఱోలీడ్చుకొను చు రెండుమద్దిచెట్లనడుమ దూటి ఱోలీడ్వ నాచెట్లు రెండును మహాధ్వనితోఁ గూలెను. అందుండి యిద్దఱు గంధర్వులు బయటికివచ్చి నారదునిచే శపింపఁబడిన మాకు తండ్రీ! నీవలన మోక్షము కలిగెనని స్తుతించి పోయిరి. సుడిగాలిలేక పిడుగు పడక యొకరిచేత ఖండింపఁబడక యాచెట్లు గూలుటయు ఱోలీడ్చుకొని సుఖుఁడై బాలు డుండుటయు చూచి జను లాశ్చర్యపడిరి.

గోకులమున ననేకోత్పాతములు గలుగుటచే నందుండఁ దగదని నందాదులు బృందావనమున కరిగిరి. రామకృష్ణు లు సమవయస్కులగు తోడిబాలురఁగూడి దూడలఁ గాచు చుండిరి. కంసునిచే పంపఁబడిన రక్కసుఁ డొకఁడు దూడల లోఁ దానొకదూడయై తిరుగుచుండ యాసంగతి యెఱిఁగి కృష్ణుఁడు దానితోఁకపట్టుకొని గిరగిరత్రిప్పి వెలగమానికిఁ గొట్టి చంపెను.

ఇంకొక దానవుఁ డొకకొంగరూపమునవచ్చి కృష్ణుని మ్రింగెను. లోకములన్నియు మ్రింగుచుఁ గ్రక్కుచుండు వేఁడు కకాఁడు బకునిచేత మ్రింగుడు పడుట వేఁడుకకాదా? అట్లు మ్రింగుడువడిన కృష్ణుఁడు కంఠమున కడ్డముపడుటచే మ్రింగలేక బకుఁడు వెలిక్రిగక్కెను. క్రక్కి పొడువఁబోవు నంతలో కృష్ణుఁడు దాని చంచువులఁబట్టి చీల్చిచంపెను.

కొన్నాళ్లకు బకుని తమ్ముఁడ ఘుఁడను వాఁడన్నను జంపిన కోపముతో కొండచిలువ రూపమున గోపాలుఁడు వచ్చు మార్గమున కడ్డముగ పెద్దగుహావలె నోరుతెఱచుకొనియుండె ను. గోపాలురందఱు బకునిజంపిన కృష్ణుఁడుండ మనకు భయ మేమనియు మనలమ్రింగిన కృష్ణునిచేత వాఁడు బకునివెంటఁ బోవుననియుఁ దలఁచి దానినోటఁ బ్రవేశించిరి. అంత తన్ను నమ్మినవారిని గాపాడుటకై కృష్ణుఁడు సహితముదూఱి కంఠ మున కడ్డముగ నిలిచి మేనుపెంచెను. ఊపిరాడనందున వాని కడుపుబ్బి గొప్ప శబ్దముతో పగిలి చచ్చెను. శ్రీకృష్ణుని నమ్మిన వారెవరు చెడరని తెలియఁజేయుటకై యందఱు బయటికి సుఖముగ వచ్చిరి.

అట్లువారు సుఖముగవచ్చి చల్దులారగించుచుండ గడ్డిమేయఁబోయిన దూడలు చాలదూఱమేగి కనపడక పోఁగా గోపబాలురు చింతించిరి. చింతింపక మీరు చల్దులార గింపుఁడు. నేను వెతకితెచ్చెదనని తాను వెతకుచుఁబోయెను. వెతకుటకుఁబోయిన కృష్ణుఁడు దూడల జాడఁదెలియక వెను దిరిగివచ్చి గోపబాలురు సహితము కనపడకుండుటచే నిదంత యు విరించి మాయయనిదెలిసి సాయంకాలమగు సరికి తానే దూడలుగను, గోపబాలురుగను రూపములఁదాల్చి యే దూడ యెట్టులే తల్లియొద్ద మెలఁగునో యేబాలుఁడెట్లు వానితల్లియొద్ద నింటియొద్ద మెలగుఁనో యట్లే యెల్లెడల తానై మెలఁగుచుం డెను. ఇట్లొకవత్సరము గడచెను. అదిబ్రహ్మ కొకక్షణ

మాయెను. అన్నిరూపులు తానై సంచరించు జగన్నాటక సూత్రధారియొద్ద తనయాటలు సాగవని తలఁచి తనలోకమున కుఁ బోయెను. అచట నదివఱకే యొక బ్రహ్మయుండెను. వీఁడెవఁడో మాయదారియని యచటివారు తఱిమిరి. శ్రీమహా విష్ణువని దెలిసియు కృష్ణుని సామాన్యునిగా మోసగింపఁ దల చిన, ప పము బ్రహ్మ తానే మోసపోయెను. ఇక చేయున దేమి యున్నది. శ్రీకృష్ణుని ప్రార్థింప బృందావనమున కరుదెంచెను. అచట మునుపటివలె వత్సముల వెతకు బాలకృష్ణుని గని దూడల గోపాలుర నప్పగించి పాదములపైఁబడి తప్పుసైరింపఁ బ్రార్థిం చి మరల తనలోకమునకుఁ బోవ నచట తన్నడ్డగించు వారు లేరైరి.

మఱునాఁడు వత్సంబులఁ గాచుతఱి శ్రీధాముఁడను గోపాలకుఁడు తక్కిన వారినిజూచి, యిచటి కనతి దూరమున తాళవనముగలదు. అయిన నందు ధేనుకాసురుఁడను రాక్షసు డు గలఁడు. పండ్లకొఱకై వచ్చినవారి నందఱిని జంపితిను చుండును. వాని యనుచరులును నట్టివారే గనుక మీరచటికి పోకుఁడని చెప్పెను. అయిన గోపాలకు లందఱు రామ కృష్ణుల నడిగిరి. ఫలము లారగింపఁ గోరికగలదనిరి. సరియని యందఱరిగి ఫలములఁ దినుచుండ ధేనుకుఁడు గాడిదరూప మున నోరుతెఱచుకొనివచ్చి బలరామునొక్క తన్నుతన్నెను. బలరాముఁడంత వాని వెనుకటికాళ్ళొకచేతఁ బట్టుకొనిత్రిప్పి చెట్టునకుఁ గొట్టెను. ఆపెట్టునకాచెట్టు విఱిగి మఱియొక చెట్టు

పైఁబడ నాచెట్టు మఱియొక చెట్టుపైఁబడ నిట్లు పెక్కు చెట్లు విఱిగెను. ఇట్లు వృక్షంబులు విఱుగుటయు ధేనుకుండు మడి యుటయుఁ గని వాని సేనలన్నియువచ్చి రామకృష్ణులచే నంత మొందెను.

యమునానదియం దొకచోట నొక మడుగుండెను. ఆమడుగున కాళియుఁడను విషసర్పముండెను. ఆమడుగు విష ముచే నిండియుండుటచే నాగాలిసోకిన మాత్రాన నందఱు చచ్చుచుండిరి. ఆకష్టముఁ జోఁగొట్టఁదలఁచి కృష్ణుఁడొకనాఁ డామడువు చెంతకరిగి వస్త్రము బిగగట్టి దానిగట్టువ నుండు కడిమిచెట్టునెక్కి నీళ్లు గుబగుబమని పైకెగురునట్లు దుమికెను. కాళియుని కమితకోపమురాఁగా కృష్ణుని గఱచి యతని దేహ మునుజుట్టుకొన కృష్ణుఁడు చేష్టలుడిగి యూరకుండుటఁగని గోపబాలు రెలుగెత్తి యేడ్చుచుండిరి. గోవులు కసవుమేయుట మాని తమనాయకుని దీనవదనముతోఁ గాంచుచు కనులనీరు గార్పసాగెను. దుశ్శకునములచే వెఱగంది మందలోని స్త్రీ పురుషులందఱు పరుగెత్తివచ్చి కృష్ణునిజూచి యనేక విధముల విలపించుచు నీవులేని మాకీబ్రతుకేల యని మడుఁగునఁ జొరఁ బ్రయత్నింప, వారల బలరాముఁ డాఫుచుండెను.

ఇక తడవుసేయఁ దగదని కృష్ణుఁడు తన మేనుపెంప బాముచుట్లు వదలుపడెను. అంత దానితోఁక పట్టుకొని తలపై పాదమిడి త్రొక్కుచు కాలియందెలు తాళమువైన జలకల్లో లశబ్దమే మృదంగనాదముగాఁగ "జయవసుదేవదేవకీనందనా!

జయగోకులబాల గోపాలబాల! జయకాళియమర్దనా! జయ కృష్ణా!" అని కీర్తించు దేవతలవాక్కులే పాటలై యుండ కోపముతోను నిస్సత్తువతోను భుజంగము విడుచు నిట్టూర్పు లే శ్రుతియై యొప్ప జగన్నాటకసూత్రధారియే నర్తింప నా నటనమెట్లుండునో మన మూహింపఁగలమా?

ఇట్లునాట్యముచేఁ గాళియుని కంఠగత ప్రాణునిజేయఁ గాళియుని భార్యలు పతిభిక్షపెట్టుమని వేఁడ దయామయుఁడు గనుక కృష్ణుఁడు దయపెట్టి కాళియుని వదలి యీమడుఁగు వదలి నీవెచటికైన నరుగుమని సెలవీయ, కాళియుఁడు భార్య లతో రత్నాకర ద్వీపమునకుఁ బోయెను. అప్పటి నుండి యా మడుఁవు పానయోగ్యమాయెను.

అప్పటికిఁ బ్రొద్దుపోవుటచే నందతారాత్రి యచటనే నిలిచిరి. అర్ధరాత్రంబున కార్చిచ్చు నలుప్రక్కలఁ గ్రమ్ము కొన నాచిచ్చు మ్రింగి కృష్ణుఁడందఱఁ గాపాడెను.

ఒకనాఁడు దూడలు కసవు మేయుచుండ బాలురు ప్రొద్దుపోవుటకై యాటలాడ మొదలిడిరి. అందు ప్రలంబుఁ డను రక్కసుఁడు రామకృష్ణులఁజంప గోపాలవేషమున వారిని గలిసి యుండెను. ఆయాటలలో నోడినవారు గెలిచినవారిని మోయుట ఏర్పాటు. అప్పుడు ప్రలంబుఁడును శ్రీధా ముఁడు నోడిరి. శ్రీధాముడుఁ కృష్ణుని సంకేత స్థలమువఱకు మోసెను. ప్రలంబుడు బలరాము నెత్తుకొని గుఱుతుదాఁటి

చాలదూర మేగుచుండ కృష్ణునివలన ముందే తెలిసికొనిన బలరాముఁడు వానినొక పిడికిటిపోటునఁ దల వ్రక్కలుచేసి చంపెను.

గొల్లలు ప్రతిసంవత్సర మింద్రుని గొలుచుచుండిరి. ఆ సంవత్సరము శ్రీకృష్ణుఁ డింద్రపూజమాన్పి కొండకు పూజ చేయించెను. అంత నింద్రునికిఁ గోపమురాఁగా విపరీతవర్షము గురియించెను. ఎల్లరకు నిలువనీడలేకపోయెను. వెంటనే కృష్ణుడు గోవర్ధనపర్వతమును తనచిటికెన వ్రేలధరించి దానిక్రింది కందఱిని రప్పించెను. ఏడుదినములు వానగురియించి మిట్టపల్లము లేకముగావించి ప్రయోజనము లేక యింద్రుఁడు గర్వ ముడిగి యవమానముపొంది కృష్ణుని ధ్యానించి దివికేగెను.

నందుఁడొక యేకాదశి నుపవసించి సాయంసమయమున స్నానముచేయ యమునలో దిగ వరుణునిదూత లతనిని తమ రాజునొద్దకుఁ గొనిపోయిరి. అది దెలిసి కృష్ణుఁడు వరుణునొద్దకు పోవ నతఁడతని ననేక విధములఁ బూజించి నందుని గారవించి పంపెను.

కంసుఁడెందఱనో రాక్షసులను బంపెను. అయిన నొక రైనను తిరిగిరారైరి. మిగుల నాశ్చర్యముతో కేశివ్యోమాసురులను నిద్దఱురాక్షసులను మరలఁబంపెను. కేశియనువాఁడు మందలోఁ బ్రవేశించి యల్లకల్లోలముచేసెను. కృష్ణునికా సంగతిఁ దెలియ పరుగునవచ్చి వానిఁబట్టుకొని విసరికొట్టెను. వాఁడా

దెబ్బ తప్పించుకొని యశ్వాకారుఁడై నోరు తెఱచుకొని మరలి వచ్చిన వాని నాలుకఁబట్టికొని వడవేయుచుఁ జేతినుబ్బింప వాని కడుపుబ్బి దోసపండువలె పగిలిచచ్చెను. ఆమఱునాఁడు వ్యోముఁడు దొంగలు గొఱ్ఱెలు అని యాడునాటలో గొల్లపిల్ల వాండ్రతోఁగలిసి యాడుచు నందఱినొక గుహలో దాఁచుచుండ వానిఁ గనిపెట్టి కృష్ణుఁడు సమయించెను.

నారదుఁడొకనాఁడు కృష్ణుఁడింకను గంసుని జంపు ప్రయత్నముచేయుచున్నాఁడని కేశివ్యోములరాకకై నిరీక్షించు చున్న కంసునొద్దకుఁజని వారుచచ్చిన విధమును రామకృష్ణుల జన్మరహస్యమును దెలిపెను. వసుదేవుఁడు చేసినమోసమునకు కంసుఁడతని జంప నుంకింప వలదని నారదుఁడు వారింప, వారి నందఱిని చెఱలోఁబెట్టి ధనుర్యాగముపేరుచెప్పి నందాదులతో డ వారినితోడి తెచ్చుటఁ కక్రూరునిఁబంపెను. అంతకుముందే కలహ భోజనుఁడరిగి కృష్ణ బలభద్రుల కవ్వార్త యెఱిఁగించి వెళ్లెను.

అక్రూరుఁడు మహాభక్తుఁడు గనుక కృష్ణుని దర్శించు భాగ్యము గలిగినందుల కుబ్బిమహా సంతోషముతో నెప్పుడు కృష్ణుని జూతును? ఎప్పుఁడాతని పాదంబుల శిరంబుసోక వంద నం బాచరింతును? కంసుఁడు వైరియైనను నన్నీపనికి నియమిం చి మహోపకారమే చేసెను. అని స్తుతించుచు మాపటివేళకు మందఁజేరెను. అచట దూడలకై యావులఱచు నంబార

వంబులును, తల్లులఁ జేరుటకై యఱుకు లేఁగలును, వానిం బట్టంజాలక బోరగిలఁబడి యేడ్చు గోప బాలకులను గల మందను జూచుచు నందుని యిల్లుసేరెను.

వచ్చిన యక్రూరుని నందుఁడు గారవించి కుశలం బడిగెను. అక్రూరుఁడు, కంసుఁడు మిమ్ము ధనుర్యాగమున కుఁ బిలుచుటకై నన్ను పంపెనని చెప్పి కృష్ణునితో రహస్య ముగ కంసుని దురుద్దేశమును విశదీకరించెను. రాజదర్శనమున కు దగిన మర్యాదలతోఁ బోవలయునని కృష్ణుఁడు చెప్ప నేయి, పాలు, పెరుగు, వెన్న, గోరజము, మొదలగు వస్తువుల సిద్ధపఱచుకొని యందఱు పయనమైరి.

శ్రీకృష్ణుని మధురా ప్రయాణమును విని వ్రేతలు చిం తించిరి. తమ కెడఁ బాటుగలిగించిన బ్రహ్మనుదిట్టిరి. బాలకు ల వలదని వారింపని నందయశోదల దూఱిరి.

అక్రూరుఁడని పేరుపెట్టుకొని మన చిన్నకృష్ణుని గొని పోవచ్చినాఁడు. నిజముగ నక్రూరుఁడు గాఁడు. క్రూరుఁడే అని యక్రూరుని దూఱిరి. మఱియు మాజీవనాధారుఁడగు కృష్ణుని గొని పోవలదని యక్రూరుని ప్రార్థింతమా? హరిని బోనీక నిలుపుటకై వేలుపులకు మ్రొక్కుదమా? కృష్ణుని పాదంబుల కడ్డముగఁబడి వేఁడుకొందమా? లేక యతనితోనే వెడలుదమా? యని పలుతెఱఁగులఁ బరితపించుచుండిరి. వారి

భక్తి యపారముగదా! కృష్ణుని విడిచివారు నిలువఁగలరా?
మఱునాఁ డందఱును పయనమైరి. శ్రీకృష్ణుఁడు శీ
ఘ్రమున మరలి వత్తునని గోపాలకుల సమ్మతిపఱచి బలరాము
నితో రథంబెక్కెను. అక్రూరుఁడా రథమును నడపెను. దారిలో
నడ్డుపడిన యమునయొడ్డునందిగి రామకృష్ణులు జలంబు లార
గించి మరల రథం బారోహించిరి. అక్రూరుఁడు నీటదిగి
యందు రామకృష్ణులుండుట గని మరల రథంబుపైఁ జూచి
నీటను రథంబుపైనను నొక్కటే తీరుగనున్న వారిని మఱి మఱి
చూచి శంకించుచుండ బలరాముఁడు శేషుఁడుగా శ్రీకృష్ణుఁడు
చతుర్భుజుఁడై పంచాయుధ ధరుఁడై దివ్యతేజుఁడై శేషునిపైఁ
జూపట్టెను. అంతనా పరమేశ్వరుని కాతఁడు వందనం బాచ
రించి స్తుతింప భగవంతుఁ డంతర్హితుఁ డాయెను.

అంత నక్రూరుఁడు యెప్పటివలె రథంబారోహించి
నడపెను. సాయంసమయమునకు మునుపే వారు మథుర సమీప
మందలి యుపవనము ప్రవేశించిరి. అక్రూరుఁడు తనయిల్లు
పావన మొనరింప రమ్మన కృష్ణుఁడు కంసుని బొలియించిన
పిదప వత్తుననెను. అంత నక్రూరుఁడు రామకృష్ణులు వచ్చిర
ని కంసున కెఱింగించి తనగృహమునకుఁ జనెను.

సాయంకాలము రామకృష్ణులు కొందఱు గోపాలురఁ
గూడి విహారార్థము మథురఁ బ్రవేశించిరి. అవ్వార్త నెఱిఁగిన
పుర స్త్రీలొకరి నొకరు పిలుచుకొనుచు పూలు గంధాక్షతలు

చేకొని శ్రీకృష్ణునిపైఁజల్ల మిద్దెలు మేడలెక్కి సంసిద్ధులై యుండిరి. శ్రీకృష్ణుఁడును వారికి తన మోహనాకారము కన్నుల కఱవు దీఱఁగనఁబఱచెను.

వార లతనిరూపమును కన్నుల వెంట లోఁగొని హృదయంబుల నిలిపి చొక్కుచు పుష్పవర్షము గురిపించిరి. వారవ్విధమునఁ గొంతదవ్వరుగ చాకలియొకఁడు వారి కగపడెను. అప్పుడు వారు ఓ చాకలీ! మేము రాజున కల్లురము మాకు చలువవస్త్రములిమ్ము తరువాత నీకు మేలుచేసెద మనిరి. అంత నా గర్విష్ఠుయైన చాకలి గొల్లలారా! మీకింతపొగరా! తొలఁగుఁడు తొలఁగకున్న చావు నిశ్చయమనెను. అంత కృష్ణుఁడు వాని తలయొగిరి క్రిందపడునట్లు తనచేతితోఁ గొట్టెను. అదిచూచిన తక్కినచాకలివారును భయముచే వారివారి మూటల సయితము క్రిందఁబడవైచి పరుగెత్తిరి. అంత రామకృష్ణులు వారికి వలసినవి తీసికొని ధరించి గొన్నిటి గోపకులకిచ్చి ధరించుకొండని మఱికొంత దవ్వరుగ నొక సాలెవాఁడు వారికని నేసిపెట్టియుండిన దువ్వలువలిచ్చి సత్కరించెను. వానిని వారు ప్రీతితోఁపుచ్చుకొని యతనికి వలసినవరము లొసఁగి సుదాముఁడను మాలాకారుని గృహమున కరిగి వాని పూజలంది మాలలధరించి వానికాయురారోగ్యైశ్వర్యము లొసఁగి రాజవీథిఁజనుచుండ త్రివక్రమైన కుబ్జ యొకత సుగంధంబులఁ గొనిచనుచున్న దానినిజూచి కృష్ణుఁడాలేపంబు లెవ్వరికిఁగొనిపోయెదు? వానిని నాకిమ్ము నీవుచక్కనయ్యెద వన నామె ఓ చక్క

నయ్యా! నీవలె నందఱు చక్కగనుందురా? వలసినవిగై కొను మని యిచ్చెను. కృష్ణుడుగంధములఁదికొని దానిమువ్వంకదీర్చె ను. అంత కుబ్జతనయింటికి రమ్మన, మాపనియైన తరువాత వచ్చెదనని యొప్పించి కృష్ణుండు ధనుశ్శాలకరిగెను. అందు మిగుల గొప్పదైన వింటి నొకదానిం గని కృష్ణుఁడు ఏనుఁగు చెఱకు గట్టనువిఱచునట్లువిఱిచెను. ఆచప్పుడునకు కావలి వార లరుదెంచి చుట్టుముట్ట వారా విఱిగిన రెండు తుండ్లఁ గొని వారల సమయించి విడిది కరుదెంచిరి.

రామకృష్ణులు గావించిన పనులాలకించిన కంసుని కా రాత్రి నిదురపట్టలేదు. మఱియు కలఁతనిద్దురవలన ననేక స్వప్నములుగని దుర్నిమిత్తములు గని మరణ చిహ్నములు గని పిచ్చివానివలె నయ్యెను.

అనుకొన్న తీరున మల్లరంగ మమర్పఁబడెను. వారివా రి యాసనములవారు వా రధిష్ఠించిరి. నందాదులు ముందుగనే రాజునకుఁ గానుక లర్పించి కూర్చుండిరి. మల్ల దుందుభులు మ్రోగెను.

రామకృష్ణులు రంగమునకువచ్చుచుండ దారిలో కువల యా పీడమను కుంజరమొకటి వారిపైఁబడ నుంకించెను. దా నిని తప్పించుకొని కృష్ణుఁడు దానిని మావటివానితోఁ జంపి కంసు ని గుండె లవియరంగస్థల మధిష్ఠించెను.

చాణూర ముష్టికులను నిరువురు మల్లురు రామకృష్ణులంజూచి మల్లయుద్ధమునకు ప్రోత్సహించి బిలిచిరి. చాణూరుఁడు కృష్ణునితోను, ముష్టికుఁడు బలరామునితోడను దగిలిరి. శ్రీకృష్ణుఁడు చాణూరునితో వేడుకకుఁ గొంతపెనఁగి చేతులుపట్టుకొని త్రిప్పి నేలకుఁగొట్టెను. నవరంధ్రముల నెత్తురొలుకఁ జాణూరుఁడు చచ్చెను.

అంత బలరాముఁడు ముష్టికుని ముఖముపై దన ముష్టింబొడిచె. వాఁడాపోటుతో నేలఁగూలెను. దానిఁజూచి తక్కిన మల్లురందరు ప్రాణంబులఁ గాపాడుకొనఁ బరుగిడిరి.

ఆ కలకలంబువారించి కంసుఁడు "వీరిని నగరి వాకిటికి పంపుఁడు. నందుని వసుదేవుని జంపుఁడు. ఉగ్రసేనుని సహితము చంపుఁడు" అని చెప్పుచుండఁగనే కృష్ణుఁడు మదించిన యేనుఁగుపైకి లంఘించు సింహమువలె మంచెపై కెక్కి కంసుని వెండ్రుకలుపట్టి యీడ్చి క్రిందికి ద్రోసెను. ఆపాటుతో కృష్ణునకే కష్టములేక కంసుఁడుచచ్చెను. చచ్చిన కంసుని శరీరమును ఏనుఁగుశరీరమును సింహ మీడ్చురీతి నిక్కడి కక్కడి కీడ్చెను.

కంసుని చావువిని యేతెంచిన వాని తమ్ముల కృష్ణుని యొద్దకైన నరుగనీక బలరాముఁడే యమపురికనిపెను. అంత వారికి కృష్ణుఁడు యథావిధిగ నగ్నిసంస్కారములు సేయందగువారింబనిచి దేవకీ వసుదేవుల బంధవిముక్తులఁజేసి

బలభద్రసహితంబుగ వారికి బ్రణామంబొనర్చి యింతకాల మూరకుండినందుకు క్షమింపుఁడని వేఁడుకొనెను. తరువాత శ్రీకృష్ణుఁడు ఉగ్రసేనునికి మథురపట్టముగట్టి నందునికి వస్త్రభూషణాదులొసఁగి కౌగిలించుకొని యనిపినఁ బాయలేక బాష్పజలపూరిత లోచనుఁడై నందుఁడు వల్లవులతో వేపల్లెకుఁజనెను.

వసుదేవుఁడు రామకృష్ణుల కుపనయనము గావించెను. తరువాత రామకృష్ణులు కాశీపురికిఁజని సాందీపనియొద్ద వేద వేదాంగములు, పురాణములు, శాస్త్రములన్నియు కొలఁది దినములలోనేర్చి గురువునకు గురుదక్షిణగా ప్రభాసతీర్థమున మునిఁగి చనిపోయిన గురుపుత్త్రుని యమనగరంబునుండి కొని వచ్చి యిచ్చి గురుని దీవనలు వడసి రథారూఢులై మథురకు వచ్చి జననీ జనకులకుఁ బ్రియంబుగ సుఖంబుగ నుండిరి.

ఇట్టి రామకృష్ణులఁ గనిపెంచిన తల్లులుగదా ఉత్తమ మాతలు.



శ్రీకృష్ణాయనమః

# తిక్కనతల్లి.

## రణతిక్కన.

సింహపురమును నెల్లూరును బరిపాలించుచుండిన మనుమసిద్ధిరాజునొద్ద రణతిక్కన యను సేనానాయకుఁ డుండెను. అతఁడు సిద్ధయతిక్కన, పోలమతిక్కన, మయిలమతిక్కన, ఖడ్గతిక్కన, రణతిక్కనయని యైదునామంబులు గలవాఁడై యెన్నికగాంచె. అతఁడు భారతముఁ దెనిఁగించిన తిక్కన సోమయాజికిఁ బెదతండ్రికుమారుఁడు. రణతిక్కన మహావీరుఁడు. అంతియకాక విద్వాంసుఁడు. పండితులకు బహుమానము లొసఁగి దాతయనిపించుకొన్నవాఁడు.

అతనికాలమున నుత్తరదేశమున గొప్పకఱవు వాటిల్లెను. వర్షములేకపోవుటచే మనుజులును బశువులును జాలఁగష్టపడవలసివచ్చెను. ఎఱ్ఱగడ్డపాడునకు రాజగు కాటమరాజును, పల్నాటిరాజగు పద్మనాయకుఁడును మనుమసిద్ధి రాజునొద్దకు దూతలనుబంపి మీరాజ్యమునందలి బీళ్లలో మాపశువుల మేసికొను దానికై కొంతధనమిచ్చెదము. అని యొడంబడిక చేసికొని తమపశువుల నచ్చట మేపుకొనుచుండిరి.

ఇట్లుండఁగా వారిరాజ్యమున వర్షము కురిసినదనియు, బయళ్లలోఁ బచ్చికబాగుగాఁ బెరుఁగుచున్నదనియు వారికి దెలిసెను. తెలిసినవెంటనే వారు మునుమసిద్ధి కియ్యవలసిన ధనము నీయక తమపశువులఁదోలించుకొని పోవుచుండిరి. ఆసంగతి దెలిసిన సింహపురిప్రభువు తనసేనానాయకుఁడగు రణతిక్కనను బిలిచి కొంతసైన్యమిచ్చి వారి పశువుల నడ్డగించి చెల్లింపవలసిన మేఁతపన్ను కొనిరమ్మని పంపెను.

రణతిక్కన ముందుగా కాటమరాజు పశువులనడ్డగించి పన్నియవలసినదని యడిగెను. మాపశువులలోఁ 'జాలనష్టము సంభవించినది మఱియు గడువుకాలము కాలేదు. కావున మే మీయవలసిన డబ్బు నీయ'మని కాటమరాజు పలికెను. అంత వారిరువురికి మాటలు పొసఁగకుండుటచే యుద్ధమారంభమా యెను.

కాటమరాజునకుఁ దోడు పద్మనాయకుఁడు వచ్చెను. ఇరువురిసేన లేకమై తిక్కనసేనను నాశముకావించెను. తిక్కన ధైర్యమువదలక పోరాడియు ప్రయోజనము లేకపోయెను. చివరకతఁడు వారిచేఁ జిక్కువడెను. కాటమరాజు తిక్కనను జూచి గేలిచేసి 'మీరుబ్రాహ్మణులు మిమ్మేమియుఁ జేయఁజా లము. మీయింటికిఁబోయి వేదపఠనముతోఁ గాలక్షేపము చేయుచు సుఖముగా మీజీవితము గడపికొనుఁడు' అని నమ స్కరించి విడిచిపెట్టెను.

రణతిక్కన కదనరంగమున నవమానమొంది రోషము తో మరల గొప్పసేనను గూర్చుకొని బయలుదేఱవలయునని యోజించుచు నింటికివచ్చెను. అవఱకే తిక్కనయోడెనను వార్త పురమెల్ల వ్యాపించినది. తిక్కనభార్యయు నతనికి స్నానముచేయ వేన్నీళ్లతోడి నులకమంచము నడ్డుగానుంచి మంచ పుగోడపై బసుపుముద్ద నుంచెను. ఇదియేమని తిక్కన యడిగెను.

పగవారికి వెన్నుజూపి పరుగిడి వచ్చిన మగతన ముగల మన యాఱువేలనాయకులు నవ్వారా? ఇదివఱకు మన యింట మీతల్లియు నేనును నిరువు రాడువారముంటిమి. ఇప్పుడు నీతో ముగురాడువారమైతిమి. చింతించక స్నాన ము చేయుము. అని యవమానకరముగా నావీరపత్ని పలికెను. అంతినతడు రోషము, నవమానము, దుఃఖము ముప్పిరిగొన నతిత్వరితముగ పెన్నలో స్నానమాడి భుజింప నింటిలోనికేగెను. తల్లి నడ్డించుచు విఱిగినపాలు పోసెను. "అమ్మా! పాలువిఱిగిన వే" యనితిక్కన యనెను.

నాయనా! నీవు యుద్ధమునకుపోయి వీరభటులగెలు వలేక మగపందవై విఱిగివచ్చితివి. మేయుటకుపోయిన పశువు లు నయితము విఱిగివచ్చినవి. పాలును విఱిగినవని యావీరమాత ప్రత్యుత్తరమిచ్చెను. రణతిక్కన మాఱుమాటాడక యన్నము విడిచి లేచి రాజునొద్దకుఁ బోయి కొంతసేనను గూర్చుకొని మరల యుద్ధమునకు బయలుదేఱెను.